# శ్రీవాణి పాఠకులకు మనవి

శ్రీవాణి ఆరవ జన్మదిన ప్రత్యేక సంచికను ప్రశంసిస్తూ అనేకమంది లేఖలు వ్రాస్తున్నారు. బాలసాయి చరిత్ర, నేను ఎవరు?, బాబాకు సాటలేరిలన్, బాబావారి సర్వజ్ఞత, భగవదానుగ్రహం లభించాలంటే .... మొదలగు వ్యాసములను ప్రత్యేకంగా ప్రశంసిస్తూ అనేక లేఖలు వచ్చాయి. బాలసాయి చరిత్ర ఇంకా మిగిలింది. మార్చి సంచికతో పూర్తి అవుతుంది. ఈ అసౌకర్యమునకు మన్నించ ప్రార్థన.

జనవరి ప్రత్యేక సంచిక ముద్రణ ఆలస్యం కావటంవలన జనవరి 18 వ తేదీన post చేసినాము. సమయం లేకపోవడంవలన ఫిబ్రవరి సంచిక పేజీలు తగ్గించవలసివచ్చింది. అన్యథా భావించకండి. మార్చి నెల నుండి మామూలుగా పాఠకులకు అందించగలం.

**క్రొత్త చందాదారులకు శ్రీవాణి జన్మదిన ప్రత్యేక సంచిక (జనవరి '90) తో పాటు భగవాన్ బాబావారి జన్మదిన ప్రత్యేక సంచిక (నవంబర్ '89) ఉచితంగా పంపబడుతుంది.**

చందా పంపేటప్పుడు M. O. కూపన్‌మీద తమ చందా క్రొత్తదా? లేక పాతదా? తెలియపరచవలెను. పాత చందా అయితే చందా నెంబరు పేర్కొనవలెను.

ఇకనుంచి క్రొత్త చందాలు పంపేవారుగాని, రెన్యూయల్ చేసేవారుగాని సం॥ చందా రు. 42-00 విధిగా పంపవలెను. రు. 36-00 లు అంగీకరించబడవు.

చందా గడువు అయిపోయినప్పటికీ, గౌరవనీయులైన పాఠకులకు శ్రీవాణిని నిలుపుదల చేయకుండా పంపుతూనే ఉన్నాము. ఎందువలననగా చందా సకాలంలో రెన్యూయల్ చేయకపోవటం కేవలం అశ్రద్ధేనని చాలామంది విషయంలో ఋజువవుతున్నది. పత్రిక ఆపకుండా పంపుతున్నందులకు అభినందిస్తూ చాలామంది తమ చందాలు పంపుతున్నారు. మరికొందరు జీవితసభ్యత్వంగాని 4 సం॥ చందా గాని పంపి మమ్ము ఆశ్చర్యచకితులను గావిస్తున్నారు నవంబర్ 1989తో చందా పూర్తి అయి రెన్యూయల్ చేయనివారు కేవలం 107 గురు మాత్రమే. పత్రిక వద్దని వ్రాయకపోవటంవలన అట్టివారికి పత్రిక ఆపుచేయకుండా పంపుతున్నాము. వెంటనే రెన్యూయల్ చేసి సహకరిస్తారని ఆశిస్తున్నాము. ఒకవేళ రెన్యూయల్ చేయదలచనియెడల వెంటనే వ్రాసి సహకరించమని కోరుతున్నాము.

**ఒకవేళ ఎవరైనా తమ చందా గడువు పూర్తిఅయినతరువాత రెన్యూయల్ చేయటానికి ఇష్టం లేనియెడల చందా గడువుకు ఒక నెల ముందుగా తెలియపరచి సహకరించమని కోరుతున్నాము. ధన్యవాదములు - మేనేజర్**

## శ్రద్ధాంజలి

దైవజ్ఞరత్న, వాస్తుజ్యోతిషవిద్వాన్ శ్రీ కవితా కామేశ్వరశర్మ (74) గారు ది 19-1-90 న అవనిగడ్డలో స్వర్గస్తులైనారని తెలియపరచుటకు విచారిస్తున్నాను. వారు లోగడ శ్రీవాణిలో జ్యోతిషంపై పాఠకుల ప్రశ్నలకు సమాధానం యిచ్చేవారు. వారి ఆత్మకు శాంతిని చేకూర్చమని సర్వేశ్వరుని ప్రార్థిస్తూ, వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాపమును తెలియబరుస్తున్నాము. —సం॥

ఫిబ్రవరి 1990
సంపుటి : 6
సంచిక : 2

శ్రీవాణి
సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24–51 రామానాయుడుపేట
మచిలీపట్నం–521 001
ఫోన్ : 2818

విడి ప్రతి : రు. 3–50
సంవత్సర చందా : రు. 42–00
4 సం॥ల చందా : రు. 150–00
జీవిత సభ్యత్వం : రు. 600–00

Cheques & Drafts should be drawn in favour of SREEVANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

# విషయసూచిక



ముఖచిత్రం :
భారతకోకిల శ్రీమతి సరోజినీనాయుడు

# సత్యసాయి చెప్పిన బాలసాయి

(గత సంచిక తరువాయి)

నేను అప్పుడు ఈ కవిత్వాలంతా వ్రాస్తానని ఈ కొట్టే సుబ్బన్నకు బాగా తెలుసు. అప్పుడప్పుడు నా స్కూలుకు కూడా వచ్చి కాచుకొని కూర్చుండేదివాడు. మాకు ఫలానా మందొచ్చింది, ఫలానా ఇది వచ్చింది, అది వచ్చింది, జనరల్ షాపుగా వుంది, ఏదైనా అడ్వర్‌టైజ్ కోసం పిల్లలతో పాడించుకొంటూ పోతాం.

## శ్రీసత్యసాయిబాబా

ఏమన్నా రాసిస్తావా? అట్లా ఇట్లా అని అడిగేటటువంటి వాడు. ఆ కాలంలో ఆయనవద్ద ఒక చిన్న తడిక వుండేది. దానికి ఒక కర్ర నిలబెట్టి ఉండేది. ఆ తడిక పైన వ్రాసిన కాగితాలు అంటించుకొని దానిని పట్టుకొని కొంతమంది పిల్లలతో పాటలు పాడించుకుంటూ బజార్ల వెంబడి అడ్వర్‌టైజ్ చేసుకుంటూ పోయేటటువంటివాడు అతను. అప్పుడు కొత్తగా 'బాలభాస్కరా' అనే కొత్త మందు ఒకటి వచ్చింది. అప్పుడు ఆయనకు నేనొకటి వ్రాసి యిచ్చాను.

దొరికే దొరికే బాలభాస్కర!
బాలకులారా! రండి! బాలకులారా.... ॥
కడుపుబ్బరము కాళ్ళ వాపులు
చేతి మోడులను చెడు గుణములనుండి
ఆజాజరూక పోషణ నుండి
అత్యున్నత వ్యాధుల నుండి
అజీర్ణ విరోచనముల నుండి
అన్నిటికిని ఇది బాగేనండి
బాలకులారా! రండి! బాలకులారా!
అది ఎక్కడదని అడిగేరన్న
అందరకును తెలిసిన దేనన్న
అదిగదిగో కొట్టే సుబ్బన్న
అందరికది చిక్కును అన్న
బాలకులారా! రండి! బాలకులారా!
పండిత (శ్రీ) గోపాలాచార్యుల
పావనమైన టానిక్కన్న
బాలకులారా! రండి! బాలకులారా!

అని ఈ పాట వ్రాసిస్తే అతనికి చాలా ఆనందమై పోయింది. బాగా పాట నేర్పించేసి చక్కగా డబ్బులు వచ్చేటట్లు చేసింది. సరే! ఈ విధమైన పాట రాసిచ్చే సరికి, అన్ని షాపుల వారు వస్తున్నారు నా స్కూలు దగ్గరకు! అక్కడికీ, ఇక్కడకు అన్ని చోట్లకు వస్తున్నారు, వ్రాసివ్వమని. మాది ఫలానా విషయం, ఫలానా విషయమని చెప్పి డీటైల్సు (వివరాలు) యిస్తున్నారు. ఈ విధంగా ఇద్దరు ముగ్గురికి వ్రాసి ఇచ్చేసరికి ఇది శేషంరాజుగారికి తెలిసిపోయింది. సరే ఇప్పుడు ఎట్లాగో Leave (శలవు)లో వుంటున్నావుగదా యని, ఇక్కడ వుండవద్దు, పుట్టపర్తి వెళ్ళిపో! ఇక్కడ వుండి లేనిపోని వ్యాపారాలంతా చేస్తున్నావు. అట్లా ఇట్లా అని చాలా అరిచేసి నన్ను పుట్టపర్తికి పంపించివేశాడు.

# శ్రీవాణి జీవిత సత్యాలు

శ్రీమతి ఆర్. శైలజ
హైద్రాబాద్

వుట్టపత్రికి వచ్చాను. ఇంకా ఈ కవిత్వం ఇంతటితో మానలేదు. వస్తునే ఉంటుండాది. అక్కడ కరణం సుబ్బమ్మ అని సత్యం శివం సుందరంలో ఉంటుండాది. ఆమె భర్తకు ఇద్దరు భార్యలు. సుబ్బమ్మ, కమలమ్మ. ఇంతేగాక ఆయన కొంచెం చెడు మార్గాలలో కూడా తన కాలాన్ని గడుపుతుండేవాడు. దండిగా డబ్బున్నటువంటి వాడు. అందువల్ల అతను అనేక రకములైన చెడు మార్గములలో పోతుండేవాడు. చిన్న చిన్న పిల్లలమంతా కలిసి ఆ ఇంటిముందు కూర్చుండేవారం. ఆ పిల్లలకు పాటలు నేర్పించేవాడను. వారిని సాయంకాలం ఏటికి తీసుకువెళ్ళి ఆ పిల్లలకు పాటలు బాగా నేర్పించేవాడను. మరి రెండవరోజు సాయంత్రం వారింటిముందున్న (కరణం సుబ్బమ్మ) బృందావనం ముందు కూర్చొనబెట్టి పిల్లలందరికి ఆ పాటలు పాడమని చెప్పేవాడ్ని. అప్పుడు పల్లెలు కనుక, ఆ భాషయే దానికి సరిగా సరిపోయేది. వేరే నూతన భాషలు పెట్టుటకు వీలుకాదు. ఈ పాటలు ఎటువంటివంటే ....

ఖిండగత్తెల జేరచబోకు
ఖండితముగ నీవు కడు నీచుడవుతావు .... ॥
కులము వారలు నిన్ను కుండ నుట్టనీరు
బంధువులు నినుజూచి బయటకెళ్ళగొడతారు
స్నేహితులు నినుజూస్తె చెప్పుతోగొడతారు॥

అని ఈ రకంగా పిల్లలు పాడేసరికి అతనికి కోపం వచ్చేది. పిల్లలపైన అరిచేసి, లోపలికి వెళ్ళిపోయేది. ఇక తాను ఎడమచేతికి ఒక గడియారం పెట్టుకొని బయటకు వచ్చే వాడు. అప్పుడు పల్లెలలో గడియారం అంటే చాలా గొప్ప. ఆ గడియారం పెట్టుకుంటే అప్పుడు చాలా గొప్పగా భావించేవారు. అందులో ఆయన మఖమల్ పంచెలు కూడా కట్టుకొని పోతుండేవాడు. ఆ కాలంలో ఆడవాళ్ళు కూడను పెద్దపెద్ద బొట్లు పెట్టేవారు కాదు. చిన్నచిన్న బొట్లు పెట్టేవారు. కాసుల దండలు గజ్జలు వుంటే వారు వేసుకొనేవారు కాదు. చిన్నచిన్న చైన్లు పెట్టుకొనేవారు. చాలా తమాషాగా వారిలో మార్పు రావడం చూచి ....

ఏమి కాలంబు వచ్చెను
ఓ జనులారా !
ఏమి కాలంబు వచ్చెను !
కాసుల దండలు పోయె
మోసగించే చైన్లు వచ్చెను
ఏమి కాలంబు వచ్చెను !
చుక్కబొట్టు శూన్యమాయె
శూన్యమైన జనుల కెంత
ఏమి కాలంబు వచ్చెను !
ఎడమచేతి కడాన ఎండు తళతళ బిళ్ళ
తోలుపట్టని గట్టి వేళాడగడతారు
ఏటి ఏషాలప్ప ఈది ?

( తరువాయి 5 వ పేజీలో )

శ్లో॥ సన్నిందాఽసతి నామ వైభవ కథా, శ్రీశేశయోర్భేదధీః
అశ్రద్ధా శ్రుతి శాస్త్ర దైశికగిరాం, నామ్న్యర్థవాదభ్రమః
నామాస్తీతి నిషిద్ధవృత్తి విహితత్యాగోహిధర్మాంతరైః
సామ్యం నామ్ని, జపే శివస్యచహరేర్నామాపరాధా దశ ॥

# అమృతవాణి

మాచిభట్ల చంద్రశేఖరశర్మ

"కలౌ సంకీర్త్యకేశవం" అని కలియుగంలో యజ్ఞయాగాదులు చేయటంకంటే భగవంతుని భక్తితో నోటినిండా కీర్తిస్తే చాలు. నవ విధ భక్తిలో సంకీర్తనం కూడా చాలా దొడ్డదని ప్రహ్లాదుడు పేర్కొన్నాడు. భగవంతుని దివ్యకథా విశేషాలను వర్ణించటం, ఆయన దివ్యనామాన్ని గానంచేయటం, ఆయన మహిమాదుల్ని మాటల్లో పాటల్లో వాద్యాలున్నాలేకున్నా భజనచేయటం, స్తోత్రాలు ఇవన్నీ యీకీర్తన భక్తిలోకే వస్తాయి.

మానవుడు తరించటానికి ఈ భక్తి మార్గం సుగమమని పెద్దలు బహు విధాల వర్ణించారు. అయితే శ్రద్ధగా ఏకాగ్రతతో మనసు నిండా భక్తి నింపుకొని భగవంతుని నామజపం చేయటం మంచిదే కాని నామ సంకీర్తన విధానంలో మనకు తెలీకుండానే కొన్ని లోపాలేర్పడటానికవకాశముంది. వాటిని దశ అపరాధాలని అంటారు. సహజంగా భక్తులు తాము నమ్మిన దైవాన్ని మిన్నగా భావిస్తారుకదా! ఆ భావన గాఢమవుతున్నకొద్దీ సాత్వికత పెరగాలి.

కాని ఏ మాత్రం సత్పురుషులను నిందించినా అది తప్పిదమే అవుతుంది. అది భక్తికి లోపాన్ని ఆపాదించి మచ్చగా నిలుస్తుంది. భగవంతుని యందు భక్తి శ్రద్ధలు లేనివారెవరైనా వుంటే వాళ్ళదగ్గర కూర్చొని భగవన్నామ మహిమ చెప్పటం దండుగ. చెవిటికి శంఖం వూదినట్లే. తాను శివభక్తుడైతే విష్ణువును, విష్ణుభక్తుడైతే శివుణ్ణి భేదదృష్టితో చూడటమూ ఒక అపరాధమే. ఇలాగే ఇతర మతాల విషయంలోకూడ. సర్వ ధర్మాలకు. జ్ఞానానికి నిధి వేదరాశి. ఆ వేదధర్మాన్ని లోకకల్యాణం కోసం ప్రవర్తింపజేసేవి శాస్త్రాలు. వేదశాస్త్రాది ధర్మాలను, భక్తి జ్ఞానవైరాగ్యాది విశేషాలను బోధించి మానవులను తరింపజేయటానికి వచ్చినవారే సద్గురువులు. కనుక వేద, శాస్త్ర, సద్గురు దేవుల వాక్కులపై విశ్వాసం కలిగివుండాలి.

అలా కాక వేదం మీద, శాస్త్రాల మీద, గురువుల యందు విశ్వాసంలేకపోవటం మహాపరాధం. అలాగే భగవన్నామ సంకీర్తనం మోక్ష ప్రదమని భావించాలేకాని అది కేవలం అర్థంలేని పొగడ్తగా భావించకూడదు. అదీ దోషమే. మరో విషయం; భగవన్నామ సంకీర్తనం అద్భుతంగా చేస్తున్నాంగదా అని మనం చేయవలసిన విధి విహిత కర్మల్ని త్యాగం చేయటంగాని, చేయగూడని నిషిద్ధ కర్మల్ని ఆచరించటంగాని పెద్ద దోషాలే అవుతాయి. మనం సేవించే భగవంతుని నామాన్ని మరో ఇతర మత దైవ నామంతో సరిపోల్చటం ఏ మాత్రం తగదు. అలాగే శాస్త్ర విహితములయిన కర్మలతో భగవన్నామాన్ని తారతమ్య భావంతో పరికించటమైనాసరే కూడనిదే. ఈ పది రకాల అపరాధాలు భక్తులు దూరంగా వుంచాలి. నామ సంకీర్తనకు సత్పురుష నిందాదులు పదీ పెద్ద అపరాధాలుగా వుంటాయి. ఈ అపరాధాలు ఏవీ లేని భక్తి స్వచ్ఛమైనది. అదే కావాలి మనందరికీ.

# శ్రీ సత్యసాయి చెప్పిన బాలసాయి చరిత్ర

[ 3 వ పేజీ తరువాయి ]

కంటితో చూసేది కాని వ్యవహారాలు
ఏటి ఏషాలప్పా ఈది ?
పొడుగాటి మీసముల్ గొరిగి
కటించి నాసికాగ్రమువద్ద నాల్గుంచుకు టాగు
ఏటి ఏషాలప్పా ఈది ?
( గమనిక : అప్పుడు హిట్లర్ మీసాలు పెట్టుకోవటం ఒక ఫ్యాషన్ )

అని ఈ రకమైనటువంటి పాటలను పిల్లలతో పాడించేవాడను. ఆ ఊళ్లో ఈవిధంగా ఎవరెవరు ఏమేమి చేస్తున్నారో గమనించి, వారివారి ఇంటిముందుకు పంపించి పిల్లలతో పాటలు పాడించేవాడను. కట్టకడకు ఆ పిల్లల్ని అంతా కలిపి కొట్టగా, నా పేరు చెప్పేవారు ఆ పిల్లలు. వారంతా నా ఇంటికి వచ్చేవారు. అక్కడికి వచ్చేసి గృహంబాయి (తల్లి ఈశ్వరమ్మ)కి చెప్పేవారు. కాని గృహంబాయి ఇంతవరకు ఎప్పుడయినా కాని ఒక చెడ్డ తిట్టుగాని ఒక ఏటుగాని ఈ దేహాన్ని కొట్టి వుండలేదు. ఇంకా అందర్ని కొట్టేవారు. జానకిరామయ్య, కిష్టప్ప, వెంకమ్మ, పార్వతమ్మ అందరినీ కొట్టేవారు. కాని నన్ను ఎప్పుడూ కొట్టలేదు. "నాయనా ! ఎందుకమ్మా ! ఊళ్ళో వారందరిది మనకెందుకు ? ఈ కచ్చడాలంతా మనమెందు కేసుకోవాలి ! నువ్వు ఆ పాటలు రాయద్దు" అనేక రకాలుగా చెప్పేది. నేను "నాకు తెలియదు నాకు తెలియదు" అని నేను చెప్పేవాడను. ఈవిధంగా చేస్తుంటే నా కవిత్వమనేది బుక్కపట్నానికి తెలిసిపోయింది అప్పుడు స్వతంత్రంకోసమని చాలా పోరాడుతున్నారు. బ్రిటీష్ పోలీసులు ఎవరిని పడితే వారిని, ఎక్కడ చూస్తే అక్కడ కొట్టేస్తున్నారు. ఎక్కడ కాంగ్రెసువారు మీటింగ్ పెడితే, అక్కడకు పోయి వారందర్ని జైళ్ళలో వేస్తున్నారు. నాకు ఇవన్నీ తెలియదు. నాకు వున్నది వున్నట్లు తెలుపడమే మొదటి నుంచి వాడుక. అప్పుడు బుక్కపట్నంనుంచి ఇద్దరు కాంగ్రెసువారొచ్చి మేము ఈనాడు పెద్ద మీటింగ్ పెట్టుకుంటున్నాము. ఈ మీటింగులో పాడటానికి ఫలానా రీతిలో, నీకు తోచిన విధంగా, మన భారతదేశానికి ఏవిధంగా దుఃఖం నివారణ అవుతుందో, దానికి తగినటువంటి ఒక పాట రాయాల్సిందని కోరారు. పాట రాయడమే కాకుండా ఒక చిన్న లంగా కట్టి, పైటవేసి, చిన్న పాప మాదిరిది (బొమ్మ) ఇచ్చేసి, ఒక ఉయ్యాల కట్టి (నేను స్త్రీ విధంగా వుండాలని చెప్పడంచేత) అందులో ఒక చిన్న రబ్బరు బొమ్మను పండబెట్టారు అక్కడ నేను స్టేజిపైన వున్నాను. ప్రారంభంలో....

ఏడవకు పసిబాల ఏడవకు తండ్రి
ఏడుస్తే నిను భరతవీరుడనరయ్యా ....జో ....జో

## మంజువాణి

దేహము గుడి కదలు దేవాలయంబది
భ్రష్టు పట్టకుండ బాగుచెయ్యి
నరునిలోన శివుడు నడయాడుతున్నాడు
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి !

చేయు పనిని దైవసేవగ నెంచుచు
చిత్తశుద్ధితోడ చేయవలయు
లక్ష్యశుద్ధి లేక లక్ష్యాలు తీరునా
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి !
పాత్ర ననుసరించి ఆకృతి మారేటి
నీటివంటిదేను నిజము మతము
మనిషికొక్క మతము మహిలోన వెలసేను
మమ్ము బ్రోవుమమ్మ మంజువాణి !

— భైరవభట్ల దేవీప్రకాష్

## శ్రీ సాయివా

* నరుని సేవయే నారాయణుని సేవ
* నాలుకతో భగవన్నామము, చేతులతో దీనజన సేవ చేయండి.
* నాలుకను వశము చేసుకున్న, లోకమే వశమవుతుంది.
* 'నాది' అనిన అశాంతి, నాది కాదు అనిన 'శాంతి'.
* నిరాడంబరమే మానవునికి వెలలేని ఆభరణం.
* నిర్వికారులయ్యేంతవరకు నిర్విచార స్థితి లభించదు.

హంతకుడు హిట్లరు అమర రష్యాపై
దండెత్తివచ్చెనని దడిసి ఏడ్చితివా .... జో .... జో
హిట్లరును చంపుటకు ఎర్ర సైన్యంబు
వీరుడవుతానీను వెలసు ఏడవకు .... జో .... జో
ఇంకెందుకుర నాన్న అట్లు లేడ్చెదవు
ప్రజలకైక్యత లేదటంచు ఏడ్చెదవా .... జో ..జో
ఐక్యతగ ప్రజలంత చేరి పోరాడి
స్వాతంత్ర్యమును పొందగలరు ఏడవకు ....
జో .... జో

అని పిల్లవాడు ఏడుస్తున్నట్లు, ఎందుకోసం ఏడ్చేది ? కాబట్టి నీవు ఏడ్చడానికి కారణంలేదు. ఇవన్నీ సరిపోతాయి వుండు. జవాబు కూడా దానిలో చెప్పాను. ఈ రకంగా ఒక అర్థగంటసేపు బ్రిటిషువారిని గురించి, హిట్లర్‌ను గురించి అంతా కలిపి చెప్పేసరికి పోలీసువారు వచ్చేసి నారు. వారు కూడా పాట పాడుతుంటే గమ్మున కూర్చున్నారు. బాగానే పాడుతున్నాడు, చిన్నపిల్లవాడు, ఏదో మధురంగా పాడుతున్నాడు. చాలా సంతోషంగా వున్నదని అందరూ చప్పట్లు కొడుతుంటే.... తెలుగు అర్థంకాకపోయినా అందరూ చప్పట్లు కొట్టడం చూచి బ్రిటీష్ పోలీసులు కూడా చప్పట్లు కొట్టారు. ఈ రకంగా అనాడు జరిగిన మీటింగు చాలావరకు వ్యాప్తి అయిపోయి... ఇక నేనున్న దగ్గరికి గుంపులు గుంపులు రావడం ప్రారంభమైపోయింది. మరి ఇక్కడికి శేషమరాజు వచ్చేశాడు. అక్కడ మళ్ళీ చుప్పనాతి బుద్ధి బయలు దేరింది. స్వామియొక్క పేరు ఈ పుట్టపర్తిలో ఎక్కడ చూచినా గాని రాజు ! రాజు ! రాజు ! అని చెప్పుకోవడం విన్నాడు. ఈయన కూడను కొంచం కవి. అనాడు ట్రయినింగులో వుంటున్నాడు. ఇలాంటి సమయం లోపల ఇతనికి కొంతవరకు మనసుకు కొంచం కష్టంవేసి ఇంక యిక్కడ నిన్ను పెట్టకూడదు, నాతోపాటు ఉరవకొండ తీసుకొనిపోవాలన్నాడు. ఉరవకొండ తీసుకొని వెళ్ళాడు. సరే, ఉరవకొండకు పోయేటప్పటికి, అక్కడ లక్ష్మిపతి అని ఒక హెడ్‌మాష్టర్ వుండేవాడు. ఆయన చాలా మంచివాడు కడపనుంచి ఉరవకొండకు బహదూర్‌ఖాన్ కూడా ట్రాన్స్‌ఫర్ అయివచ్చాడు. అక్కడ చాలా మంచి టీచర్సు వుంటూ వున్నారు. తేరరాజు అని ఇంకొక ఆయన వుండేవాడు. ఆయన తరువాత తండురాజు అనే తెలుగు టీచర్ వుండేవారు. వీరందరూ స్వామి అంటే ఎంతో ఇదిగా వుంటుండేవారు. అంటే ఏమి ? అనాడు స్వామి అంటే తెలియదు. రాజు ! రాజు ! రాజు ! అని అదేదో వాళ్ళ జన్మాంతర సంస్కారం చేత, నన్ను చూచేటప్పటికే వాళ్ళకు వాళ్ళకు తెలియకుండానే ఇట్లా అంటుండేవారు అయ్యో ! మా స్టూడెంట్ కదా యని మరీ ఎక్కువ చేసేటటువంటి వారు సరే ! నన్ను స్కూలులో చేర్పించారు ఇంకా అక్కడనుండి క్రమ క్రమేణ పిల్లలతో ఏవిధమైనటువంటి

సంబంధం వుండేది కాదు. ఎప్పుడు చూచిన ఏదో ఒక విధమైనటువంటి మంచి విషయాలు బోధన చేయడమో ! పిల్లలు ఎవరైనా పెన్సిల్ కొట్టేస్తున్నారని తిడుతుంటే, ఆ విధంగా తిట్టకూడదని, అలా దూషించకూడదని, పెద్దలను గౌరవించాలని....అనేకమైనటువంటి మంచి మాటలను వాళ్ళకు చెబుతూ వస్తుండేటటువంటివాడ్ని. అక్కడ కూడను నా డస్కులో ముగ్గురం కూర్చొనే టటువంటివారము. అక్కడ కూడను నా ప్రక్కన కూర్చొనేటటువంటి పిల్లలు చాలా మంచి పిల్లలు. వారికి 10, 11 సంవత్సరముల వయసు పాపం. ఇక మా క్లాసుకు ఒక టీచరు వస్తుండేవారు. క్లాసుకు వస్తూనే " రాజు ! కమాన్ " అనేవారు నేను దగ్గరకు పోతే చెక్కిళ్ళు పిండటం, తలంతా నిమరటం, క్లాసయ్యేంత వరకు ఏదో ఒకటి మాట్లాడుతుండటం. ఇంట్లో ఏం చేశారు ? ఏమి వంట చేశారు ? అంటూ నన్ను ఊరికే చెక్కిళ్ళు పిండుతుండేవారు. ఆయనకు బిడ్డలు లేరు. ఆయన ఇంట్లో ఏదైనా చేసుకుంటే నాకు పొట్లంకట్టి తీసుకొనివచ్చి యిచ్చేవారు. నేను చెప్పాను. సార్ ! మీ ఇంట్లో మాంసం, గింసం చేసుకుంటారేమో ! నేను ముట్టను సార్ ! అంటే లేదు రాజు ! లేదు నా హృదయ పూర్వకంగా చెబుతున్నా. నా సాక్షిగా నేను చెబుతున్నాను. అలాంటిది నీకు నేను చేయనే చేయను. నీకు నేను ఎంతో ప్రేమతో తెచ్చాను. తినమనిచెప్పి చాలా బ్రతిమాలేవాడు. అప్పుడు నేనేదో కొంచం తినేసరికి అతను కంటినీరు పెట్టుకొనేవాడు. ఈ రకంగా బహదూర్ ఖాన్ చాలా ఆనందంగా వుండేటటువంటివాడు. ఆయన క్లాసువచ్చిందంటే పిల్లలందరూ నన్ను గేలిచేసేవారు. " పో ! రాజు ! పో ! సార్ దగ్గిరికి పో ! " అని గేలిచేసేవారు. పోకపోతే టీచరేమనుకుంటాడో ! పోతే పిల్లలంతా ఈవిధంగా గేలిచేస్తారు. పిల్లలు గేలిచేస్తున్నారని టీచరుతోగాని, టీచరు నన్ను ఇంత ప్రేమతో చూస్తున్నారని పిల్లల దగ్గర అహంకారంతోగాని ఎప్పుడు నేను నటించలేదు. ఈవిధంగా వుంటుంటే ఒకనాడు అక్కడ కూడా "స్కూల్ డే" వచ్చింది. ఆ స్కూల్ డేకి నన్ను అనేకరకముల వేషములు వేయమని, నీ గొంతు చాలా బాగుంటుందనీ, పాటలు బాగా పాడుతావని.... అట్లా ఇట్లా అని నన్ను తొందర పెట్టేసినారు ఇంకా ఆ స్కూల్ డే లోపలే నాతో ఒక వేషం వేయించారు. దాని లోపలనే " చెప్పినట్లంతా చేస్తారా ? " అనే కథను నేనే వ్రాసి నేనే యాక్టు చేసాను. దానిలో కృష్ణుడి వేషం వేశాను.

( మిగతా భాగం వచ్చే సంచికలో.... )

## సంస్కృత నీతిసూక్తులు

1. " ఇంద్రియాణాం జయో శౌర్యో
మృత్యునోఽపి విశిష్యతే "
మృత్యువును జయించడంకన్నా ఇంద్రియాలను జయించడం గొప్ప విషయం.

2. " ఇంద్రోఽపి లఘుతాం యాతి
స్వయం ప్రఖ్యాపితైర్గుణైః "
తన గుణాలను తానే చెప్పుకుంటే, ఇంద్రుడంతటివాడు కూడ చులకనౌతాడు.

3. ఇష్టం ధర్మేణ యోజయేత్ "
ఇష్టమైనవాటిని ధర్మమార్గంలో కూర్చుకోవాలి.

4. ఇష్టాలాభే లబ్ధమేవేష్టమస్తు "
ఇష్టమైనది లభించనప్పుడు ఉన్న వస్తువునే ప్రేమించాలి.

# విజ్ఞానవాణి

ఎస్. సాయినాధ్

హెచ్. జె. బాబా

అణుశక్తి, న్యూక్లియర్లపై విశేష ప్రయోగాలను బాబా చేసారు. 1958 లో బాబా పరిశోధనల వలన భారత్‌లో అణుశక్తి రీసెర్చి సెంటర్లు ప్రారంభించారు. అటమిక్ ఎనర్జి కమీషన్‌కు బాబా ఛైర్మన్‌గా నియమించబడ్డాడు. బాబా 1909 లో అక్టోబరు 30 న జన్మించాడు. శాస్త్రజ్ఞుడే గాక బాబా చిత్రలేఖనంలో మంచి కళాకారుడు కూడా. 1967 లో బాబా అటమిక్ రీసెర్చి సెంటరును ట్రాంబేలో నిర్మించిరి. తన 57 వ ఏట హెచ్. జె. బాబా ఒక విమాన ప్రమాదంలో మరణించారు.

జె. సి. బోస్

మొక్కలకు, లోహాలకు కూడా జీవముందని నిరూపించిన శాస్త్రజ్ఞుడు జగదీస్ చంద్రబోసు. 1868 నవంబరు 30 మైమన్‌సింగ్‌లో బోసు జన్మించాడు. వృక్ష శాస్త్రంలో ఎన్నో పరిశోధనలు చేసిన బోసుకు గుర్తుగా బోస్ ఇనిస్టిట్యూట్ కలకత్తాలో ప్రారంభించారు.

---

## విదురనీతి

శ్లో॥ సాముద్రికం వణిజం చోరపూర్వం
శలాకధూర్తం చ చికిత్సకం చ
అరిం చ మిత్రం చ కుశీలవం చ
నైతాన్ సాక్ష్యేత్వధి కుర్వీత సప్త

చేతులు చూచువానిని, దొంగ అయిన వ్యాపారిని, మోసగాడైన జూదరిని, వైద్యుని, శత్రువును, నటుని-ఈ ఏడుగురును సాక్ష్యము చెప్పుటకు నియోగించరాదు,

యస్. యన్. భట్నాగర్

మిశ్రమాలు, ద్రవపదార్థాలపై భట్నాగర్ పరిశోధనలు చేశారు. 1894 లో ఫిబ్రవరి 21 న షాహాపూర్‌లో జన్మించారు. 'ఇండస్ట్రియల్ రీసెర్చి కౌన్సిల్' కు భట్నాగర్ డైరెక్టరుగా పనిచేశారు. 'అయిల్ రిఫైనరీస్' పెట్రోల్ నిక్షేపాలను ఎక్కడెక్కడ అధికంగా ఉన్నాయో భట్నాగర్ పరిశోధించి కనుగొన్నాడు.

జె. బి. యస్. హల్డానే

మానవ శరీరంలో పెరుగుదలలో వచ్చే మార్పులమీద జె. బి. యస్. హల్డానే పరిశోధన జరిపారు. నవంబరు 5, 1892 లో ఆక్స్‌ఫర్డ్‌లో జన్మించిన జె బి యస్. పరిశోధనల నిమిత్తం 1957 లో భారతదేశానికి వచ్చి స్థిరపడిన ఆంగ్లేయుడు. హిందూ సాంప్రదాయాలంటే మిక్కిలి ప్రీతి. భారతదేశంలో వివిధరకాలైన జంతువులుండటం వలన వాటిపై పరిశోధనలు చేశాడు. 'ఇండియన్ స్టాటిస్టికల్ ఇనిస్టిట్యూట్' కలకత్తాకు తొలి ప్రొఫెసర్‌గా నియమించబడ్డారు. అతని 71 వ ఏట కాన్సర్‌తో భువనేశ్వర్‌లో మరణించాడు. చివరి క్షణంలో కూడా తనకొచ్చిన కాన్సర్ మహమ్మారిపై చక్కటి కవిత్వాన్ని రచించిన ఏకైక శాస్త్రజ్ఞుడు జె. బి. యస్. హల్డానే.

కె. కె. పాండే

చిన్నతనంలోనే డార్విన్ సిద్ధాంతాన్ని అతి తేలికగా అర్థమయ్యే రీతిలో వ్రాసి స్కూలు టీచర్ల మెప్పు పొందిన పాండే వృక్షశాస్త్రంలో ఎన్నో ప్రయోగాలు, పరిశోధనలు చేశాడు. 1928 డిశంబరు 11 న వారణాసిలో జన్మించాడు. 1970 లండన్ యూనివర్సిటీ నుండి డి. యస్సీ. డిగ్రీని సంపాదించాడు.



ముఖచిత్ర వ్యాసం :

# భారత కోకిల శ్రీమతి సరోజినీ నాయుడు

## పరిచయం

భారత మహిళల్లో మహోన్నతులయిన వారిలో శ్రీమతి సరోజినీ నాయుడు ఒకరు. సుమారు ముప్ఫయి సంవత్సరాలపాటు స్వాతంత్ర్యోద్యమంతో సన్నిహిత సంబంధమున్న మహిళామణి. స్త్రీల సాంఘిక నైతిక సంస్కరణలు, మహిళోద్యమంతో కూడా అలాంటి సన్నిహిత సంబంధమే కలిగిన మహిళా నాయకురాలు. ఈ విజయ సాధనలకోసం ఆమె అంతులేని బలాన్నుప యోగించి ముందు గేయ రచయిత్రిగా, కవితల్లె కవయిత్రిగా సుప్రసిద్ధురాలయింది. అది కూడా అంగ్ల సాహిత్యంలో కవిత అల్లడంలో ప్రావీణ్యురాలయింది.

## జననం - బాల్యం

1879 ఫిబ్రవరి 13వ తేదీన హైదరాబాద్ నగరాన డాక్టర్ అఘోరనాథ్ ఛటర్జీ ప్రథమ సంతానంగా జనించింది. అయన తూర్పు బెంగాల్‌లోని ఒక గ్రామం నుంచి హైదరాబాదు వచ్చి స్థిరపడిపోయారు డాక్టరుగా. అయన గొప్ప సంస్కృత పండితుల వంశంలో జనించారు. అందుకే వారు మత గ్రంథాలను అయనకు బాగా నేర్పారు. బెంగాల్‌లో వారి కుటుంబానికమిత గౌరవ మర్యాదలుండేవి. కులాన్ని, సంప్రదాయాన్ని అయన బహు తక్కువగా పాటించారు. పద్దెనుగు సంవత్సరాల చిరు ప్రాయంలో తన పవిత్ర జంధ్యాన్ని త్రెంచి గంగలో పారవైచిన సంస్కారి

## తండ్రిగారి ప్రజ్ఞాప్రాభవాలు

అఘోరనాథ్ ప్రతిభావంతుడయిన శాస్త్రవేత్త. ఉర్దు, బెంగాలీ భాషల్లో కవి. రంగులపై సరోజినీదేవికి గల ప్రేమాభిమానాలు జీవితం పట్ల ఆమెకున్న అనందం, కవితల నల్లాలన్న సహజమైన కోరిక తండ్రిగారి నుంచి వారసత్వంగా వచ్చి ఆమెలో జీర్ణించిపోయిన గుణాలు.

డా॥ వి. కోటేశ్వరమ్మ

## విద్యాబుద్ధులు

సరోజినీదేవి పన్నెండేళ్ళ చిరుప్రాయంలోనే ప్రథమ శ్రేణిలో పరీక్షయిన సునిశిత మేధావి. ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో మొదటి స్థానం సంపాదించ గలిగిన ప్రతిభా వంతురాలు లండన్‌లో, కేంబ్రిడ్జి యందు చదివినప్పటికీ తరువాత మరే పరీక్ష పాసః లేదు.

## కవయిత్రి సరోజిని

చిన్న వయసులోనే ఆమె కవయిత్రి కాగలిగింది. తలిదండ్రుల నుంచి కవితలల్లడం వారసత్వంగా తనకు లభించాయని ఆమె రాసింది. " ఒకరోజు నేను పదకొండు సంత్సరాల బాలగానున్నపుడు అల్జీబ్రాలోని ఒక లెక్కను పాటగా పాడుతూ ఉన్నాను, అది సరిగా రాలేదు. కాని అనుకోకుండా నా నోటినుంచి ఒక పద్యం మొత్తం వచ్చింది దానిని వెంటనే కాగితం మీద రాశాను. అనాటి నుంచి కవయిత్రి జీవితం ప్రారంభమయింది. పదమూడు సంవత్సరాల ప్రాయంలో నేనొక దీర్ఘమయిన పద్యాన్ని రాశాను. అ పద్యమే "లేడి అఫ్ ది లేక్"-అరురోజుల్లో 1300 లైన్లున్న పద్యాన్ని రాశాను. ఆ సంవత్సరమే 2000 లైన్లున్న నాటకం రాశాను. ఏమీ ముందు అలోచన లేక క్షణికోద్రేకం వల్ల సంపూర్ణమయిన ఉద్వేగంతో మొదలుపెటాను. కేవలం మా డాక్టరు నేను చాలా

జబ్బుగా ఉన్నానని, పుస్తకం ముట్టరాదని అనడంవల్ల కలిగిన ఉద్వేగం ఉద్రేకం వల్ల రాసిన నాటకం," అని రాసింది.

## సుప్రసిద్ధ ఆంగ్లకవులతో పరిచయం

ఇంగ్లాండులో ఉన్నపుడు ఎడ్మండ్ గాస్సే అనే ప్రఖ్యాత ఆంగ్ల సాహిత్య విమర్శకునితో పరిచయం కలిగింది. ఆమె పద్యాలలోని నేర్పరితనం, వ్యాకరణ బద్ధమయిన తీరు, యెక్కడా పొరపొచ్చాలు లేని భావాలు, పాశ్చాత్యభావాలు, శిల్పం ఉన్న తీరు తెన్నులను ఆయన చూచి ఆంగ్ల సంప్రదాయాలను అనుకరించ గలిగిన తెలివిగల కవయిత్రిగా గాక స్వచ్ఛమయిన భారతీయ కవయిత్రిగా కవితల నల్లమని ఆమెకు సలహా నొసగాడు. ఆనాటి నుంచి ఆమె పూర్తి భారతీయ నేపథ్యంతో కవితలనల్లసాగారు.

## స్వదేశాగమనం

1898 సెప్టెంబరులో ఆమె తిరిగి భారతదేశం వచ్చారు. ఆ సంవత్సరం డిశంబరులో డాక్టరు గోవిందరాజులు నాయుడుతో ఆమె వివాహం జరిగింది. సంఘ సంస్కరణలో ఆ వివాహమొక మైలురాయిగా నిలిచింది. ఆనాటికి కులాంతర వివాహాలు యించుమించు రాక పోవడమే దానికి కారణం. దంపతులు హైదరాబాదులోనే స్థిరనివాసులయి ఆనందంగా గడిపారు. నలుగురు పిల్లలు కలిగారు.

## హిందూ-ముస్లిం సంస్కృతి నేపథ్యంగా

సుప్రసిద్ధ ఆంగ్ల సాహిత్య విమర్శకులు ఎడ్మండు గాస్సే సలహా ననుసరించి ఆంగ్ల యితివృత్తాలు, నేపథ్యాన్ని వదలి, హైదరాబాద్, సికింద్రాబాద్‌లను వాటి హైందవ-ముస్లిం సంస్కృతుల నేపథ్యాన్ని స్వీకరించి ఆంగ్లంలో కవితల నల్లనారంభించింది. తన సొంత పట్టణ సంస్కృతిని జీర్ణించుకొన్న సరోజిని దానికి కవితల్లో ఒక రూపాన్నిచ్చింది. ఆమె మొదటి గ్రంథం, "ది గోల్డెన్ థ్రెషోల్డు". ఆంగ్ల ప్రపంచాన్ని పెనుతుపాన్‌లాగా ఆ గ్రంథం ఊపివేసింది. 1905 లో లండన్ నగరాన ప్రచురించబడిన ఆ పుస్తకం ఆనాటి పుస్తకాలన్నిటి కంటే ఎక్కువ అమ్ముడు పోయింది. "ది ఫెదర్ ఆఫ్ దిడాన్;" "బర్డ్ ఆఫ్‌టైమ్", "ది బ్రోకెన్ వింగ్" మొదలయిన పద్యాలు పాఠకుల అభినందనల నందుకోగలిగాయి.

## తాను నిర్మించుకున్న గూటినుంచి బయటకు రావడం

"కవిత్వం" ఆమెకు పుట్టుకతో వచ్చిన విద్య అయినప్పటికీ సాంఘిక, ఆర్థిక జీవనంలోనికి ఆకర్షించ బడింది. ఆమె స్వయంగా కట్టుకున్న గూటినుంచి బహుశః గోపాలకృష్ణ గోఖలే బయటకు రమ్మని ఒత్తిడి చేసి యుండవచ్చేమో ! 1914లో మహాత్మాగాంధీని కలిసి కొంది. 1916 అఖిలభారత కాంగ్రెసు సభలో జవహర్ పండితునితో పరిచయం కలిగింది. ఆ యిద్దరి ప్రభావం ఆమెపై బాగా పడింది. రవీంద్రనాథ ఠాగూర్, సి.యస్.

ఆంధ్రదాసులతో స్నేహం పెంపొందింది. 1916 కాంగ్రెసు సభలో ఆమె అద్భుతమయిన ఉపన్యాసాల నిచ్చింది అనాటి నుంచి అనేక మహిళా సభల్లో, విద్యార్థి సభల్లో గంభీరంగా, అనర్గళంగా ఉపన్యసించ సాగింది. ఆమె నిజమయిన జీవితం, కృషి అప్పటినుంచే ప్రారంభ మయింది. అన్నిటికంటే ముఖ్య మయింది హిందూ-ముస్లిం సమైక్యత కోసం ఆమె గావించిన కృషి. సప్తమ అఖిలభారత మహిళా సంఘంలో మాట్లాడుతూ సంకుచితమయిన, వేర్పాటు తత్త్వమున్న భారతీయు డెవ్వడూ నిజాయితీ గల దేశభక్తుడు కాజాలడని చెప్పింది. "దేవాలయమయినా, మసీదయినా, చర్చిగాని, గురుద్వారా గాని, ఎక్కడ ప్రార్థించినా, ఏమతానికి చెందినా, ఎవరిని పూజించినా మనిషికీ మనిషికి మధ్య నున్న అడ్డుగోడలను అధిగమించ గలగాలి" అని ఉద్ఘాటించింది.

## బహుముఖ కార్యక్రమాలు

అనేక సందర్భాల్లో హిందూ ముస్లింల మధ్య భేదాన్ని చూచి ఆమె యెంతో బాధపడిపోయింది. ముస్లింల సంస్కృతిని యెంతగానో ప్రశంసించింది. ముస్లిం జీవన విధానాన్ని అభినందించింది. బాల్యంనుంచి మహమదాలీ జిన్నా, అలీ సోదరులు, తదితర సోదరులతోపాటు ఆమెకు మంచి స్నేహితులు. లక్నోలో జరిగిన ముస్లిం లీగ్ సదస్సుకు ఆమె హాజరయింది. జాతీయ సాంఘిక సమస్యల్లో హిందువులతో కలిసి పనిచేయాలని ఆ సభలో వారు తీర్మానించారు. నూతన శకానికి ఆ సభ నాంది పలుకు తుందని ఆమె రాశారు. ఆధునిక భారత వ్యవహారాలలో ఒక వినూత్న ప్రమాణాలను నెలకొల్పగలదని అన్నారు. ఆమె బహువిధమయిన కార్యక్రమాలల్లో స్త్రీలకు ఓటు హక్కు కావాలన్న ఉద్యమం కూడా ఒకటి. ముఖ్య మయిన ప్రతి రాజకీయ సభకు ఆమె అధ్యక్షత వహించేది. బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు సభకు కూడా ఆమెనే అధ్యక్షురాలిగా ఎన్నుకున్నారు.

శ్రీ గురూజీ చెప్పిన కథలు:

# విముక్తి కావాలా? మృత్యువు కావాలా?

సోమనాథ మందిరంలో అపారమైన సంపద ఉంది. ఈ విషయం తెలుసుకొన్న మహమ్మద్ గజనీ దానిపై దండెత్తివచ్చాడు. అక్కడికి చేరడానికి అతను పంజాబ్, రాజస్థాన్, సౌరాష్ట్ర ప్రాంతాలను దాటవలసి వుంది. కొన్ని వేలమైళ్ళు ప్రయాణం చేయాలి. ఇదేమీ జనవాసం లేని అరణ్యం కాదు. అక్కడ అనేక చిన్న రాజ్యాలున్నాయి. అయితే ఈ రాజ్యాలవారికి గుజరాత్ రాజ్యంతో మంచి సంబంధాలు లేవు. వీరందరూ గజనీని ఎదిరించి నట్లయితే అతడు సోమనాథ్ వరకు రావడమనే ప్రశ్నే ఉండేది కాదు. రాజస్థాన్ ఎడారి ద్వారా ప్రయాణించినట్లయితే, అతని సైన్యాలు తిండి నీరు దొరకక నశించిపోయేవి కాని గజనీ తెలివైనవాడు. "నేను చిన్న చిన్న రాజ్యాలవారికి మిత్రుణి. మీ అందరికి గుజరాత్ రాజ్య దురాక్రమణ నుంచి విముక్తి కలిగించడానికి వచ్చాను" అని ప్రకటించాడు. "విముక్తి" అనే పదము వింటూనే రాజు లందరూ పరవశించిపోయారు. వారు గజనీని ఎదిరించవలసిందిపోయి అతడికి అన్నివిధాలా తోడ్పడ్డారు. పర్యవసానం మనందరికీ తెలిసిందే.

గజనీ కోర్కె నెరవేరింది. విముక్తి భ్రమలో ఉన్న రాజులకు త్వరలోనే తెలిసివచ్చింది. వారందరు తమ బంధువులను, ఆత్మీయులను కోల్పోయారు. జీవితాంతం పరాయి రాజుకు దాస్యం చేయవలసివచ్చింది.

— కథాకల్పతరువు నుండి

## యు నా లు

నయనాలు ఎందుకు ?
అందాన్ని చూడనపుడు
మనసులోని భావాల్ని
పదుగురుకి పంచనపుడు
పచ్చదన పరిమళం
వెచ్చనూర్చుకోనపుడు
పురివిప్పి పూర్తి న్యాయం
చేయనపుడు
ఈ కళ్ళెందుకు?
ఈ కుళ్ళు సమాజంలో
జిల్లేళ్ళే నయం మరి !

- ఎస్. ఎస్. రెడ్డి

## హోమ్‌రూల్ లీగ్ ప్రతినిధిగా లండన్ చర్చలకు వెళ్ళడం

1916 జులైలో అఖిలభారత హోమ్-రూల్ లీగ్ ప్రతినిధిగా ఆమెను ఇంగ్లాండు పంపారు. అక్కడ స్త్రీల హక్కుల కోసం ఆమె వాదించారు భారత సంస్కరణల మన సంయుక్త కమిటీ ముందు ఆమె తమ వాదనలను వినిపించారు లండన్‌లో. స్త్రీల ఓటు హక్కును గట్టిగా బలపరచారు. ఇంగ్లాండులో నున్నపుడు ఎన్నో సభల్లో బ్రిటిషు ప్రజలకు జలియన్ వాలాబాగ్ దురంతాలను భయోత్పాదం కలిగేటట్లు అభివర్ణించి చెప్పారు. అక్కడ ఖిలాఫత్ ఉద్యమంలో చేరింది.

## ఆఫ్రికా పర్యటన - స్వదేశాగమనము

భారత జాతీయ కాంగ్రెసు కోరిక ననుసరించి ఆమె 1924 లో కెన్యా భారత కాంగ్రెసు సభకు బయలుదేరి ఆఫ్రికా వెళ్ళింది. అక్కడ స్థిరపడిపోయిన భారతీయుల హక్కులకోసం ఆ సభ పోరాడుతోంది. తన వాగ్ధోరణిలో వారిని రగిల్చివేసింది. కార్యోన్ముఖులను చేసింది. అహింసాయుత మార్గంలో పోరాటాన్ని సాగించమని హెచ్చరించింది. అక్కడి నుండి దక్షిణాఫ్రికా వెళ్ళింది. హర్షధ్వానాలతో ప్రతిధ్వనించిన అద్భుతమయిన స్వాగతం ఆమెకక్కడ లభించింది. మొంబాసాలో తూర్పు ఆఫ్రికా భారత కాంగ్రెసుకు అధ్యక్షత వహించింది. తిరిగి 1924 సంవత్సరం మధ్యలోనే భారతదేశానికి తిరిగి వచ్చింది. 1925 లో కాన్పూరు కాంగ్రెసు సభకు అధ్యక్షురాలుగా ఆమెను ఎన్నుకున్నారు. ఆవేశపూరితమయిన ఆమె ఉపన్యాసంతో హిందూ ముస్లిం ఐక్యత కోసం ఉత్సుకతతో ఒక పిలుపు నిచ్చింది. ఆమె అధ్యక్షురాలుగా ఉండడం స్త్రీలు ముందుకు రావాలని, ప్రజల జీవనంలో ప్రవేశించాలన్న భావానికి ప్రత్యక్ష రూపమిచ్చింది.

## గాంధీజీ అనుయాయిగా అమెరికా పర్యటన

1928-29 లో గాంధీజీ ఆమెను తన ప్రతినిధిగా అమెరికా సంయుక్త రాష్ట్రాలు, కెనడా పంపారు. కాంగ్రెసు ప్రతినిధినిగా మిస్. మేయో గ్రంథం "మదర్ ఇండియా" వల్ల కలిగిన దుష్ఫలితాన్ని సంపూర్ణంగా తుడిచి వేయడానికి పంపారు. ఆ గ్రంథం భారతీయుల జీవన విధానాన్ని, భారతదేశాన్ని గురించి హీనమయిన చిత్రాన్నిచ్చింది. దానిని తన మృదు మధురమయిన అనర్గళమైన ఉపన్యాసాలతో పూర్తిగా ఆ ప్రజల మనసు నుంచి తుడిచివేసి భారతీయుల నిజస్వరూపాన్ని ప్రత్యక్షపచే తన బాధ్యతను విజయవంతంగా నిర్వర్తించింది. తిరిగి రెండోసారి తూర్పు ఆఫ్రికాకు పంపారామెను.

## ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనడం

సరోజినీదేవి 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. అరెస్టయి జైలుకెళ్ళారు. 1931 లో గాంధీ గారితో లండన్ రౌండ్ టేబుల్ సభకు రెండోసారి

వెళ్ళారు. అక్కడ మహిళకు ప్రాతినిధ్యం వహించారు. తిరిగి స్వదేశానికి వచ్చారు.

## చట్టధిక్కారోద్యమంలో

1932 జనవరిలో చట్టధిక్కారోద్యమంలో, పాల్గొని అరెస్టయ్యారు తిరిగి విడుదలయ్యారు. 1942 ఆగష్టు 9న మళ్ళీ 'క్విట్ ఇండియా' ఉద్యమంలో నిర్బంధించింది బ్రిటీషు ప్రభుత్వము. మహాత్మునితో కూడా అరెస్టయ్యారు. ఇద్దరినీ ఆగాఖాన్ భవనంలోనే నిర్బంధించారు. అనారోగ్యంగా వున్నప్పటికీ ఆమె ఉనికి జైలు వాతావరణాన్ని ఉత్తేజపరచిందని మీరాబెన్ రాశారు. "మాలో యెవ్వరూ, బాపూకూడ ఆగాఖాన్ భవనంలో కలిసి నివసించే వరకు ఆమె స్వభావంలోని సంపూర్ణ సంపదను గ్రహించలేక పోయాం. అద్భుతమయిన ఆమె కవితాశక్తి మీ కందరకు బాగా తెలుసు అనర్గళమయిన ఉపన్యాసధోరణి, సునిశిత చమత్కార యుక్తులు తెలుసు. కాని యిప్పుడు ప్రత్యక్షంగ పొందిన అనుభవం. అనుభూతులువల్ల ఆమె మాతృహృదయాన్ని, దాని వైశాల్యాన్ని తెలిసికో గలిగాం. బాధల్లో, విచారాల్లో ఆమె గుండెబలాన్ని గురించి తెలిసికోగలిగాం" అని చెప్పింది మీరాబెన్.

## తీవ్రమయిన అస్వస్థత-విడుదల

ఆగాఖాన్ భవనంలో తీవ్రమైన అవ్వస్థతకు గురైంది సరోజినీదేవి. బ్రిటీష్ ప్రభుత్వం ఆమెను 1943 మార్చి 21న విడుదల చేసింది కొన్ని నెలపాటు హైదరాబాద్ వెళ్ళింది కాని అనతికాలంలోనే యించుమించు నాయకులందరు జైలులో ఉండడంవల్ల క్విట్ ఇండియా ఉద్యమం బాధ్యత వహించవలసి వచ్చింది.

## అత్యున్నత దశ

1947 లో ఆమె ఏషియన్ రిలేషన్సు సభకు క్రొత్త డిల్లీలో అధ్యక్షత వహించారు. భారతీయులకే గాక ఆసియా ప్రజలందరి నాయకురాలిగా ఆమెనెన్నుకున్నారు. ఆ సభలో ఆమె ఉపన్యాసం ఒక ఉద్రేకానికి. ఉద్వేగానికి ఉదాహరణగా నిలిచింది అద్భుతమయిన వాక్ప్రవాహమై సభికులందరినీ తనతో కొట్టుకొనిపోయినది.

## స్వాతంత్ర్యావిర్భావం

1947 ఆగష్టు 15న చివరకు భారతదేశం స్వాతంత్ర్యాన్ని సాధించింది. సరోజినీదేవికి ఉత్తర ప్రదేశ్ గవర్నర్ పదవినిచ్చి మహిళలను గౌరవించి జాతి గౌరవాన్ని ఇనుమడింప జేసింది కేంద్రప్రభుత్వం. ఆ ఉన్నతపదవి నామె రెండేళ్ళపాటు అలంకరించింది. 1949 మార్చి 2వ తేదీ ఆ భారత కోయిల ఈ లోకాన్ని వదలి శాశ్వతంగా వెళ్ళిపోయింది. లక్నోలో గోమతీనదీ తీరాన ఆమెను దహనం చేసిన స్థానంలో ఒక స్మారక చిహ్నాన్ని నిర్మించారు.

"రాజకీయాలను అత్యున్నత పథానికి, అద్భుతమయిన కళారంగానికి గొనిపోయిన వ్యక్తి ఆమె దేనిని తాకినా తనలోని ఆవేశాగ్నితో, ఆకాంక్షతో నింపేవారు. ఆమె ఒక సుసంపన్నమయిన సంస్కృతికి ప్రతినిధిగా నిలువగా అనేకరకాలయిన సంస్కృతీ ప్రవాహాలామె లోనికి ప్రవహించి భారతీయ సంస్కృతిని మహోన్నతమయిన సంస్కృతిగా మరింత దేదీప్యమానంగా ప్రకాశింప జేస్తూఉండేవి" అని జవహర్‌లాల్ ఆమె మరణించినపుడు గౌరవనీరాజనాలిచ్చారు.

బాలికలు, యువతీమణులందరికీ ఈ మహానాయకురాలి జీవితం ఆదర్శం కావాలనీ, అద్భుతమయిన ఆమె సృజనాత్మక శక్తీ, అనర్గళమయిన ఉపన్యాసధోరణీ, అతులితమయిన దేశభక్తి, అద్వితీయమయిన ధైర్య సాహసాలు, కార్యదీక్ష, లక్షలాది భారతీయుల్లో దేశభక్తినీ, కర్తవ్య పరాయణతను రగుల్గొల్పగలగడం, కొంతవరకయినా పాఠకులనావేశపరుస్తుందన్న ఆశతో ఈ అద్భుతశక్తి సామర్థ్యాలున్న మహిళ జీవితాన్ని మీ కందిస్తున్నాము.

కొందరు ప్రభావితులయినా ఈ కృషి సఫలమవుతుందని ఆశిస్తున్నాము.

—o0o—

# అన్నమయ్య జీవితం శ్రీ పదార్చన

( గత సంచిక తరువాయి )

" శరీరానికి కర్మ — మనసుకు భక్తి - ఆత్మకు జ్ఞానము " అని ఘనవిష్ణువు ప్రబోధించాడు. " నీవు ఇంటికి వెళ్ళు. దారిలో అహోబిల నరసింహస్వామిని, నవ నరసింహాలను దర్శించుకో. అక్కడ అదివణ్ శఠగోప యతీంద్రులవారి అనుగ్రహం సంపాదించు, వివాహం చేసుకున్నావు కనుక నీవిప్పుడు శృంగార కీర్తనలు రచించు. మరొక సంగతి — నా తరువాత అన్నమాచార్యుడు ఈ దేవాలయానికి ప్రధానాధికారిగా ఉంటాడు. నీలో శక్తి లేదనుకోకు. నీలో ఉన్న భక్తే ఇందుకు తార్కాణం " అని అనతిస్తాడు

## ఇల్లిందల సరస్వతీదేవి

అన్నమయ్య శ్రీనివాస కళ్యాణాన్ని ఎన్నో కీర్తనలలో గానం చేస్తాడు. అలా గానం చేసే అన్నమయ్యకు ' ఆరు కొండలలో మొదటిది మూలాధార చక్రం పృధ్వీతత్వముతో కూడినది. ఇక్కడి నుండి పైకిపోయే శేషుడే కుండలిని. అతడు సహస్రాకారంతో ఆకాశ రాజ్యంలో సహస్రదళ కమలాన్ని అందుకుంటాడు యోగ మార్గంలో 29 అంతర్గతమైన సంఘర్షణల " ని వివరణ చేస్తాడు.

అన్నమయ్య తాళ్ళపాక వెళ్ళిన తరువాత, జయదేవుని గీతగోవిందానికి దీటైన శృంగార పదాలు అనేకంగా రచిస్తాడు. అహోబిలక్షేత్రానికి వెళ్ళి దైవ దర్శనం చేసుకుని శఠగోప యతీంద్రులను దర్శించి సేవించాడు.

" అన్నమయ్యా నీ కంటే ముందుగా నీ రచనలు స్వామి పాదాలకు చేరుకున్నాయి " అని యతీంద్రులు అనగానే అన్నమయ్య తన కీర్తనలలో అహోబిల క్షేత్రాన్నీ కొండలనూ కోనలనూ ప్రతిధ్వనింపచేశాడు. యతీంద్రులు అన్నమయ్యకు వేదాంత రహస్యాలు బోధించారు.

అన్నమయ్యకు అదివరలో వేదాల మీద గల శంకలన్నీ యతీంద్రులు తీర్చారు. అహింస కూడదని ఖండితంగా చెప్పారు కులము మతము అన్నీ మనము కల్పించుకున్నవేనని ధృవీకరించారు. వేదాల మీద అతడికి నమ్మకం కలిగించాడు.

ఆ తరువాత భగవద్రామానుజులవారి వద్ద అన్నమయ్య విశిష్టాద్వైత సారమంతా గ్రహించాడు. శఠగోప యతి " విజయనగర సామ్రాజ్యాన్ని విద్యారణ్యులు కేవలం ధర్మరక్షణ కొరకు స్థాపించారు. ఆ విజయనగరం ఇప్పుడు రాజకీయంగా చిక్కుల్లో ఉంది. దేవాలయాలు ధ్వంసమవుతున్నాయి. నీవు అక్కడ ఉండి తిరిగి ధర్మాన్నీ భారతీయ సంస్కృతినీ రక్షించు " అని అనతిస్తారు.

అన్నమయ్య భక్తియోగంలో సంకీర్తనా సాంప్రదాయ సంస్థాపనకు జన్మించిన వాడని ఆయన కీర్తనలు ఋజువు చేశాయి.

అన్నమయ్య గృహం సకల కళా నిలయం. సరస్వతీ మందిరం. అన్నమయ్య జన్మదినోత్సవం ఇంటివారే చేశారు. ఆయన ఆ రాత్రి కావ్య గానం చేశారు.

" ముద్దుగారే యశోద ముంగిట ముత్యం వీడు
దిద్దరాని మహిమల - దేవకీసుతుడు వీడు
అంతలింత గొల్లెతల అరచేతి మాణిక్యము పంత
మాడే కంసుని పాలి వజ్రము "

అన్నమయ్య ఇంటిలో అందరూ సంకీర్తనాపరులే. కుమారులు పెద తిరుమలేశ్వరుడు నరశింగము తల్లి

లక్కమాంబ, కోడలు తిరుమలాంబ అందరూ సంకీర్తనం చేశారు.

మల్లికార్జున నిలయానికి శ్రీశైలమని పేరు. శ్రీపతి అంటే శ్రీవిద్యకు అధిష్ఠాన దైవము. వేంకటేశ్వరుడు విష్ణువు, శివుడు, భైరవుడు, శ్రీదేవి, బాలాజీ - భక్తుల అభీష్టాన్ననుసరించి భగవంతుని సాకారమేర్పడుతుంది.



"ఎంత మాత్రమున కొలిచిన వారికి
అంతమాత్రమే నీవు" గానంచేశాడు

అన్నమయ్య. ప్రభువు వీర నరసింహ రాయలు అన్నమయ్యతో పెనుగొండను అనుకుని ఉన్న దుర్గమారణ్యాలలోపలికి వెళ్ళారు. వెంట అన్నమయ్య మిత్రుడు గోవిందస్వామి ఉన్నాడు. వేణుగోపాలస్వామి దేవాలయంలోకి వచ్చిన అన్నమయ్య దృష్టి వేణుగోపాలుడు కోనేటి రాయడుగాను రుక్మిణీదేవి అలవేలు మంగగాను దర్శనమిచ్చారు. దేవాలయ వాతావరణమంతా జలమయంగా కనబడ్డది.

" పొడగంటిమయ్య పురుషోత్తమా మము
నెడకవయ్య కోనేటి రాయడా "

ఆ దేవాలయం లోపలి భాగం నుండి ఒక యువకుడు బైటికి వచ్చాడు. ఆయన గడ్డాలు మీసాలతో యువకుడైన యోగివలె ఉన్నాడు అన్నమయ్య యోగివలెఉన్న శ్రీశైలపతితో భక్తి ఉద్యమానికి కావలసిన వ్యూహ రచన చేసుకుంటూ కొద్దికాలమక్కడే చర్చలు జరిపాడు ఆయన పాండిత్యానికి విస్మయమందాడు కర్నాటక ప్రాంతంలో బసవేశ్వరుని వీరశైవం దేశీయ పద కవితలను ఆధారం చేసుకుని విజృంభించింది. బసవేశ్వరుడు స్వయంగా లక్షాఅరవైనాలుగువేల పదములను రచించాడట

ఒకనాడు అన్నమయ్య వేణుగోపాలస్వామి సన్నిధిలో

" నిత్య పూజలివివో నేరచిననోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥

తనువే గడియట తలయే శిఖరమట
పెను హృదయమే హరిపీఠమటా
కనుగొన చూపులే మన దీపములట
తన లోపలి యంతర్యామికిని
పలుకే మంత్రమట పొడపైన నాలికే ?
కలకలమను పిడి (పైడి) ఘంటయట
అనుపైన రుచులే నైవేద్యములట

.... ....

శ్రీశైలపతి ఈ సంకీర్తనను విని పరమానందభరితుడైనాడు. గోవిందస్వామి అన్నమయ్య వెంబడి ఉండి, వాటికి తాళము రాగము నిర్దేశించి, తాటిఆకుల పైకి ఎక్కిస్తున్నాడు. ఇటీవల అన్నమయ్య బాహ్యస్మృతి కోల్పోయి, అలౌకిక స్థితిలో సంకీర్తనలను పలుకుతుండటంవల్ల వాటిని వృథా పోనీయకుండా జాగ్రత్త పడుతున్నాడు.

కర్నాటక ప్రాంతంలో కొంతకాలంగా దాసకూటములు చురుకుగా పనిచేస్తున్నాయి. ఒకపైపు శైవులు, ఒకపైపు రామానుజ భక్తులు, వేరొకవైపు మాధ్వకూటములను ఏర్పరచి ప్రజలలో చైతన్యాన్ని కలిగిస్తున్నారు. ఆంధ్రదేశం నుంచి అన్నమయ్య వస్తున్నాడనగానే విభేధాలను విస్మరించి " ద్రవిడాగమ సార్వభౌముడు అన్నమయ్యకు స్వాగతం " అంటూ వచ్చి ఆయనను స్తుతించారు.

పతి వచ్చి " అన్నమయ్యా, నీ కీర్తన ఒకటి వినాలని వచ్చానయ్యా " అన్నాడు.

తీరిఃలేక విసుగులో ఉన్న గోవిందస్వామి " నేను అలిసిపోయను. అయినా సంకీర్తనానికి వేళాపాళా లేదా ? నేను తంబూరా మీటను " అన్నాడు. అన్నమయ్య అతడిని సమాధానపరచి పాడటానికి లేచాడు -

" అయోగ్యులైన లౌకిక గాయకులు మాత్రమే వాద్య సహకారం వెనుక దాక్కుంటారు. అలౌకిక ప్రజ్ఞగల సంకీర్తనా సార్వభౌముడికి అవ్వేవి అక్కరలేదు. సంకీర్తనం చెయ్యి అన్నమయ్యా" అన్నాడు శ్రీశైలపతి. అన్నమయ్య చిరునవ్వుతో వేంకటేశ్వరుని పదములపై తాను రచించిన పదాన్నొకటి సంకీర్తనం చేశాడు. అది అత్యంత మధురంగా శ్రీశైలపతి చెవులకు సోకింది.

వేంకటేశ్వరుడు చిరునవ్వుతో సంకీర్తనా కైంకర్యాన్ని స్వీకరిస్తున్నాడు.

అన్నమయ్య పదాలు శ్రీపదార్చన చేసి సేసలుగా మారాయి.

అన్నమయ్య తిరుపతి వెళ్ళినప్పుడు కరువుకాటకాల వల్ల భక్తులకు భోజనాలు లేవు. అన్నమయ్య సహించలేక వేంకటేశ్వరస్వామికి ద్రోహం జరిగినట్లు భావించి తమ అగ్రహారమునుండి వస్తుసామగ్రి తెప్పించి తిరిగి సమారాధనలు యథాప్రకారం జరిగేటట్లు చూశాడు.

అన్నమయ్య తండ్రి అవసాన దశలో ఉన్నప్పుడు అన్నమయ్యను బాల్యంలో శిక్షించినందుకు తనను క్షమించమని కోరాడు. అందుకు -

ఈ పాదమే కదా యిల యెల్లగొలిచినది
ఈ పాదమే కదా ఇహపరము లొసగెడిది
ఈ పాదమే కదా యిల నహల్య గొరికైనది
ఈ పాదమే కదా ఋషింప దుర్లభము
ఈ పాదమే కదా యిల వేంకటాద్రిపై నిలిచినది

మాత్రం తులసితీర్థం తండ్రి గొంతులో పోస్తూ శ్రీపాద తీర్థాన్ని సంకీర్తనం చేశాడు

"శ్రీహరి పాదమే చెడని మందు
మోహపాశాలు గోసిమోక్షమిచ్చే మందు
కోరికతో వెలగట్టి కొనితే దొరకని మందు "

అన్నమయ్య విశ్రాంతి లేకుండా గానం చేస్తూనే ఉన్నాడు. ఒక సందర్భంలో వీరనరసింహరాయలు "రాజ్యాన్ని నడపటానికి ఏ అధ్యాత్మిక శక్తి తోడ్పడక పోతే నా రాజకీయ సామర్థ్యమొక్కటే చాలదు ఇక్కడ ఉండిపో" అని ప్రలోభపెట్టాడు. కాని అన్నమయ్య తన జీవితం శ్రీ పదార్చనకే అంకితమని నిక్కచ్చిగా స్నేహితుడనిగాని రాజనిగాని చూడకుండా చెప్పాడు. కాని-

అన్నమాచార్యుడు తన సంకీర్తనకు సామాజిక ప్రయోజనమున్నదని పునరాలోచన చేసి, తను వచ్చి పోతూ ఉంటానని వాగ్దానం చేశాడు. అక్కడ అన్నమయ్యకు రాచమర్యాదలన్నీ జరిగాయి మొహర్లూ. మొదలైన సకల సంపదలూ బహూకరించారు. కాని అన్నమయ్య అది వైష్ణవధనమని వైష్ణవులకే పంచి పెట్టాడు.

అన్నమయ్య పెనుగొండలోనే క్షేత్రం చేసుకొని, విజయనగర సామ్రాజ్యములో రామానుజ కూటములు సంకీర్తన మండలులు, వందల సంఖ్యలో ఏర్పరచి—"ధర్మం - సంస్కృతి కూడా శ్రీ పదార్చనలో చేరినవే కదా ?" అని సంతృప్తిపడుతూ తన వాగ్దానాన్ని నెరవేర్చుకున్నాడు.

అన్నమయ్య సంకీర్తనలలో సాంఘిక ప్రయోజనమున్నదని ఋజువు చేసినట్టుగా ఎందరో రోగపీడితులు ఆరోగ్యాన్ని పొందారు. విషాద హృదయాలెన్నో ఆనందనిలయాలయ్యాయి.

"పలుకు తేనెల తల్లి పవళించేను
కలికి జనముల విభుని కలసినది గాన "
అంటే తనే నాయికగా భావించి గానము చేశాడు.

అన్నమయ్య ఎక్కడ ఉన్నా వేంకటేశ్వరస్వామినీ అలవేలుమంగను, అనేక విధాలుగా ఊహించుకొని కీర్తించి ఆనందించేవాడు.

అన్నమయ్య తిరుమలకు పోగానే స్వామివారి ధనం ప్రభుత్వ బొక్కసంలోకి పోతున్నదన్న వార్త విన్నాడు ప్రభువుల ధనకాంక్ష దైవధనం వరకూ సాగిందా? ఆయనకు రాజుల మనస్తత్వంపైన ఏహ్య భావం కలిగింది

చక్రవర్తి మల్లికార్జునరాయడు అన్నమయ్యను " విజయనగర ఆస్థానకవిగా ఆంధ్ర కర్నాటక సామ్రాజ్యాలకు ఏకైక వాగ్గేయ కారక శిఖామణిగా మిమ్ము నియమిస్తున్నాన " న్నాడు.

" నేను దాసుడను - వేంకటేశ్వరుడు నా స్వామి " అని తప్పించుకున్నాడు అన్నమయ్య. " విజయనగర సామ్రాజ్యానికే కాదు - దక్షిణానికీ సమస్త భారతావనికీ నా సహకారమందాలని సంకీర్తనం చేస్తాను " అంటూ ఆయనను ఆమోదింపచేశాడు.

అన్నమయ్య బమ్మెర పోతనను కలుసుకున్నాడు. పురందరదాసును కలుసుకున్నాడు. ఇద్దరూ కలిసి చెరి ఒక పదం రచించి సంగీత సాగర సంగమమనిపించారు. ఇద్దరూ సంకీ రనం చేసూ దేశమంతటా పర్యటించారు.

ఘన విష్ణువు తరువాత, పీఠాధిపతి అన్నమాచార్యుడే గాని, పీఠంపైన ఒకసారైనా కూర్చోలేదు " అది గురు పీఠం - నేను దాసుడను " అన్నాడు.

ఆంధ్ర, కన్నడ, త్రిలింగ, కళింగ ప్రాంతాలు పర్యటించి ద్రవిడ, పాండ్య సింహళ రాజ్యాలకు కూడా ఈ ఉద్యమాన్ని వ్యాపింపచేయాలని సంకల్పించాడు.

అన్నమయ్య అంతవరకు 30 వేల సంకీర్తనలు వ్రాశాడు. మరో రెండు వేలు వ్రాయాలని సంకల్పించాడు.

అన్నమయ్య తన పెద్ద కుమారుడు పెద్ద తిరుమలయ్యను తన తరువాత పీఠాధికారిగా తన కుటుంబమూ, వేదాచార్యుడూ, ద్రవిడాగమ పండితులూ సమావేశమైన కళ్యాణమండపంలో అభిషిక్తుడినిచేసి-"నీకు నాకు తెలిసిన సంగీత సాహిత్యాలను నేర్పించాను. ఈ సంకీర్తనలను తాటాకులపై భద్రపరచి - వీటి పోషణ - ప్రచారం నీకే ఒప్పగిస్తున్నాను నీవు కేవలం కవి పుత్రుడవే కాదు- వైష్ణవాన్ని ఒక ఉద్యమంగా వ్యాప్తి చేయవలసినవాడవు ఏ మతమయినా వేద విరుద్ధంగా ఉంటే నశించిపోతుంది." అన్నాడు.

అన్నమయ్య రాజ్యాధినేతలతో " దేశాన్ని రక్షించేది ధర్మం కాని సైన్యం కాద " ని నొక్కి చెప్పాడు. అన్నమయ్య సంకీర్తనా సార్వభౌముడే కాదు - సంఘ సంస్కర్త కూడా. ప్రజలందరికీ వర్ణ వర్గ భేదం లేకుండా దేవాలయ ప్రవేశము కలిగించాలనే సంకల్పం కలవాడు. చెప్పులు కుట్టేవాడొకడు దేవాలయ ప్రవేశం చేసి పాద రక్షలతో దెబ్బలు తినటం కళ్ళారా చూసిన అన్నమయ్య—

" తందనాన అహి తందనానా పురే
తందనాన భళా తందనాన
బ్రహ్మ మొకటే పరబ్రహ మొకటే
కందువగు హీనాధికము లిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ "

వారిని వారించి అతడిని ఊరడించి పంపించాడు.

అన్నమయ్యకు నరసింహరాయలు బాల్యం నుండీ మిత్రుడు. అన్నమయ్య సంకీర్తనలను స్తుతించినవాడే. సృష్టిలో అన్ని జంతువుల కంటె మానవుడే క్రూరమైన జంతువని అన్నవాడే. వీర నరసింహరాయలు ఒకప్పుడు అన్నమయ్యను తన రాజ్యంలో ఆస్థానకవిగా ఉండమని ప్రాధేయపడినవాడే అటువంటి వీర నరసింహరాయలు 'రాజుల చిత్తములు చంచలము ' లన్నట్లు రాజకీయ కారణాల చేత చెప్పుడు మాటలు విని అన్నమయ్యను అవమానపరచాడు. రాజ్యసభలో అన్నమయ్య ఎప్పుడూ అలంకరించే సింహాసనంమీద ఒక వీరభద్రుడు అలంక

రించాడు. ఒక వేశ్యాంగన వీర నరసింహరాయలు అయన పట్టమహిషిపైన సంకీర్తన చేస్తే తాను నాట్యం చేస్తానన్నది, అన్నమయ్య లేచి వెళ్ళిపోయాడు. అది చూసిన వీర నరసింహరాయలు విసురుగా రాజసభలో నుంచి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి రాజధిక్కారానికి అన్నమయ్య అనే వైష్ణవుడిని కారాగృహంతో బంధిస్తున్నట్టు ప్రకటన వెలువడ్డది.

కొన్నిరోజుల తరువాత ప్రభువుకు నిజం తెలిసి, పల్లకీలో కూర్చుండబెట్టి " నా ఆస్థాన కవులకు నిన్ను అధిపతిని చేయబోతున్నాను " అన్నాడు.

అన్నమయ్య జవాబు చెప్పకుండా-తిరుమల వెళ్ళడానికి ప్రయాణం పెట్టుకున్నాడు. బ్రహ్మోత్సవాలు చేయించవలసిన బాధ్యత అతడిపైన వున్నది. తాళ్ళపాక నుండి తిరుమలకు కచ్చడములో బయలుదేరాడు. పెదతిరుమలయ్య, నరసింగన వెంట వున్నారు. సుమారు డెభై ఎనభై సంవత్సరాల క్రిందట తన తల్లిదండ్రులను భజన పరులను దోచుకున్నచోటనే బండి ఆపుచేశాడు. బండివాడు విశ్రాంతి తీసుకుంటున్నాడు. అన్నమయ్యకు అకస్మాత్తుగా మెలకువచ్చింది. అతడి పూజా విగ్రహాలు మాయమయ్యాయి.

" పూజా విగ్రహాలు దొరికేవరకూ నే నిక్కడినుండి కదలను " పట్టుబట్టాడు అన్నమయ్య. కొడుకులు వెదకుతున్నారు. అంతలో ఒక కోతి విగ్రహాలమూటను తెచ్చియిచ్చింది. విగ్రహాలు అన్నమయ్యకు తప్ప తనకెందుకనుకున్నదేమో ఆ కోతి. అన్నమయ్య మనసులో శ్రీవేంకటేశ్వరుని తలుచుకున్నాడు.

అన్నమయ్య సంకల్పించిన పదాలు 32 వేలూ రచించి శ్రీవేంకటేశ్వరుని ఎదుట సంకీర్తనం చేశాడు.

గాలి మాదిరిగా - సూర్యతేజస్సులా - అనంతమైన ఆకాశంలో-గుడిలో-తల్లి ఒడిలో ఎక్కడ చూసినా అన్నమయ్య సాహిత్యమే. భజనలకూ, నృత్యాలకూ, సంగీతానికీ-సాహిత్య చర్చలకూ ఆయన సాహిత్యమే పేరొక్కంటున్నారు. భుక్తికీ ముక్తికీ భక్తికీ అన్నమయ్య సంకీర్తనమే ఆధారమయింది.

అన్నమయ్య సాహిత్యముతో జాతి పునీతమైనది.

అందరికి అన్నమయ్యే వేంకటేశ్వరుడైనాడు

మోకాళ్ళ దగ్గరికి పంచె కట్టుకుని-పొట్టిచేతుల చొక్కా తొడుక్కుని-ఫాల భాగాన పంగనామాలు తీర్చిదిద్దుకుని తన సంకీర్తనలతో యావద్భారతాన్నీ పులకింపచేసి, భక్తిమార్గం బోధించిన అన్నమాచార్యుడు-తన సంకీర్తనలతో సాంఘిక ప్రయోజనాన్నీ రాజకీయ సమైక్యతనూ భావ సమైక్యతనూ సాధించిన అన్నమయ్య-దుందుభినామ సంవత్సరంలో ఫాల్గుణ పూర్ణిమనాడు తన సంకీర్తనా వ్రతాన్ని పూర్తిచేశాడు. 32 వేల సంకీర్తనలు తాటాకుల మీద కెక్కాయి. ధన్యుడనయినా ననుకున్నాడు.

మనుమడు చిన్నన్నకు తంబూరనిచ్చి " ఇదే నా సర్వస్వము-ఇదే నా పెన్నిధి. తీసుకో. నేటినుండీ ఇది నీ సొత్తు " అప్పగింతలు పెట్టాడు.

అన్నమాచార్యుడి ముఖం తను వచ్చిన పని అయిపోయిందన్నట్టుగా వుంది.

పెదతిరుమలయ్య ఒక్క పరుగున గర్భగుడిలోకి వెళ్ళి భద్రపరచిన తాళపత్రాలను స్వామి పాదాలవద్ద ఉంచాడు. అర్చకులు వాటికి పూజలు చేశారు. అన్నమాచార్యుడు స్వామికి హారతి ఇస్తూ కళ్ళారా చూశాడు. ఆయన నాదం స్వామిలో లీనమైపోయింది.

డాక్టరు ముదిగొండ శివప్రసాద్‌గారు ఎంతో పరిశోధన చేసి రచించిన చారిత్రక నవల "శ్రీపదార్చన."పదిహేనవ శతాబ్దములో జాతీయ సమైక్యత, రాజకీయ సమైక్యత, భావ సమైక్యత, అహింస, అంటరానితనాన్ని భక్తితోపాటు యావద్భారతంలో ప్రచారంచేసిన ఈ సంకీర్తనల ఆవశ్యకత ఈనాడు మనకెంతగానో వున్నది.

# అపాయమునకు ఉపాయము - దేవ సహాయము

ఒకనాటి సభలో అక్బరు చక్రవర్తి తన మంత్రి బీర్బలును ఒక విచిత్రమైన ప్రశ్న వేశాడు. "మన పట్టణములో ఎన్ని పక్షులున్నవి? వాని సంఖ్య పొరపాటు లేక రేపు సాయింత్రంలోగా నాకు చెప్పవలె. లేనిచో కఠిన కారాగార శిక్ష"

"చిత్తము ప్రభూ!" అన్నాడు బీర్బలు.

అంత బీర్బలు తన మందిరము చేరి "ఇదెట్లు సాధ్యము? ఎంత మేధావంతుడైనను ఏవిధముగా ఈ సమస్యను పరిష్కరించగలడు! భగవంతుడే నాకు శరణ్యము. ఆయన దయ ఎట్లున్న యట్లే కాగలదు?" అని చింతాక్రాంతుడై ఆర్తితో అనన్యబుద్ధితో పరమేశ్వరుని ధ్యానించుచూ నిద్రించెను.

ఉదయమున భగవంతుని ధ్యానముచేసి లేచుచుండగా ఒక ఉపాయము తట్టెను. మరునాడుదయము ధైర్యముతో చక్రవర్తి కొలువు చేరెను.

"ఏమి బీర్బల్ సమాధానము సిద్ధమా?" అన్నాడు అక్బరు.

"సిద్ధము ప్రభూ మన నగరములోని పక్షుల సంఖ్య 257491."

"నీ మాట పరీక్షింపింతును. నీవు చెప్పినదానికన్నా తక్కువమైనచో ఏమి శిక్ష? ఎక్కువైనచో ఏమి శిక్ష?"

"ప్రభూ! నేను లెక్కించినప్పుడు 257491 పక్షులే యున్నవి కాని ప్రక్కయూరి పక్షులు మన యూరిలోకి వచ్చినచో సంఖ్య హెచ్చవచ్చును. మన యూరిలోనివి ప్రక్క యూరిలోకి పోయియున్నచో లెక్క తగ్గవచ్చును. దానికి నే నెట్లా బాధ్యుడను?" అన్నాడు వినయంగా.

"బీర్బల్! కాని పనియని కారాగార శిక్ష పడకుండా మంచి యుక్తి నాలోచించితివి నీ తెలివికి సంతసించితిని. బహుమానము కోరుకో".

"మహా ప్రభూ! బహుమానార్హత నాకు లేదు. భగవత్కరుణ బహుమాన యోగ్యము" అని జరిగిన విషయము వివరించెను.

* అనన్యముగా తన్ను నమ్మినవారిని ఎన్నడును వమ్ము చేయని వాడెవరు? అపద్బాంధవుడు భగవంతు డొక్కడే.

(శ్రీసత్యసాయి కథా సుధనుండి)

## గాయం

జీవితం అందమైనదనీ
వర్తమానమే వాస్తవమని
వసంతం అనుక్షణం విరియుననీ
సుప్రభాతం అనునిత్యం వెలుగు కురియుననీ
ఎంతగానో ఆశించావూ
ఎన్నెన్ని కథలో అల్లుకున్నావు
జీవితం చిరుకాగితపు పడవ అనీ
కాలమనే నీటిపైన దాని గమనం
నడిపించేవాని చేతిలో ఉంచుననీ
నీకు తెలిసేసరికీ
నావ ఆ తీరం చేరిపోయింది.

[ గత సంచిక తరువాయి ]

సెంట్రల్ జైలు, రాజమండ్రి
28-2-76

ప్రియమైన జయ,

తొమ్మిదవ నెలలో అడుగుపెట్టాం. కాలచక్రం వేగంగా తిరిగిపోతున్నది. నిత్యం ఏదో ఒక పనిని కల్పించుకోవడంవలన కాలం దొర్లిపోతున్నది. 'పెరోల్' విషయంలో ఎవరైనా అధికారులు "ఎంక్వయిరీ"కి అక్కడికి వచ్చారా? పెండ్లి ఖర్చు పొదుపుగా చేయగలరు. ఇప్పుడు చేతినిండా డబ్బు వున్నట్లు కనపడుతుంది. ఆఖరికి వచ్చేటప్పటికి అనుకోని ఖర్చులు, ఊహించనివి వచ్చి పైనబడుతాయి. చివరికి అప్పు చేయవలసి వస్తుంది. ఇంత ఖర్చు అయిన తరువాత ఈ చిన్న విషయంలో వెనుకాడటం మంచిది కాదనిపిస్తుంది. ఎదుటివారు మనల్ని ఎక్కడ లోభిష్టులనుకుంటారోనని ప్రతిష్ఠకోసం ప్రాకులాడవలసి వస్తుంది. "ఇల్లుకట్టి చూడు, పెండ్లిచేసి చూడు" అన్నారు పెద్దలు. దూరంగా వుండి అదెంతపని అని తేలికగా చెప్పవచ్చు. మోసేవాడికి బరువు తెలుస్తుంది. నేను అక్కడ వుండి వుంటే అంతా బాధ్యత నామీద వుండేది. మీ కందరికీ యింత బాధ్యత వుండేది కాదు. 'అంతయూ మన మేలునకే' అన్నట్లు పరిస్థితులే మానవుడ్ని తయారు చేస్తాయి. వ్యక్తిత్వాన్ని సృష్టించి పెడుతాయి. 'శంకర్' యిప్పుడు 'మైనర్' కాదు. ఆ ఇంటికి మేజరు. నిజమైన జీవితంలో అడుగిడకమునుపే హఠాత్తుగా బరువు వాడిమీద పడింది. ఇదీ ఒకందుకు మంచిదే ప్రారంభ దశలోనే కష్టాలు ఎదుర్కోవడం మంచిది. రాటుతేలుతాడు. జీవితం అంటే సుఖమొక్కటే కాదు, కష్టాన్ని ఎదుర్కొనాలని తెలియడం చాలా మంచిది. ఏది ఏమైనప్పటికి చక్కగా అలోచించి నిర్ణయాలు తీసుకోగలరు. పెద్దలు యిచ్చి వెళ్ళిన ఆస్తిని ఖర్చు పెట్టడం తేలిక. సంపాదించి నిల్వచేయడం మాత్రం కష్టం. కనుక పొదుపుగా నిర్వహిస్తారని ఆశిస్తున్నాను.

ఈరోజు "మహా శివరాత్రి" ఈరోజు ఉపవాసం వుంటున్నాము. ఇక వుంటా....

ఇట్లు
'సి'

సెంట్రల్‌జైలు, రాజమండ్రి
ది 3-3-1976

ప్రియమైన జయ,

నీవు వ్రాసిన రెండు ఉత్తరాలు చదివాను సుదీర్ఘమైన ఉత్తరాలు ఈ మధ్య వ్రాయనందుకు కోపం వచ్చినట్లు కనబడుతున్నది. ఒకటి సమయం తక్కువగా వుండటం. ప్రతి ఉత్తరంలో ఒక నూతన భావాన్ని వ్రాయడం కూడ అంత తేలిక కాదు. ఇంగ్లీషులో ఒక సామెత ఉన్నది. "An idle man's brain is devil's workshop" పని లేని సోమరి బుర్ర దయ్యాలకొంపతో సమానం అన్నారు. ఈ బుర్రను ఖాళీగా వుంచుతే రకరకాలైన చెడు అలోచనలకు అవకాశమిచ్చినవారమవుతాము. కనుక నిత్యమూ ఎడతెగని పని కల్పించుకుంటున్నాను. జీవితం చాలా విలువైనది. అందులో మానవ జీవితం మరింత అమూల్యమైనది. ఈ జీవితంలో సాధించవలసిన అమూల్యమైన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఏదో ఒకటి సాధించి సంతృప్తి చెందరాదు. ఎన్ని సాధించినా, యింకా సాధించవలసినవి, నేర్చుకోవలసినవి

చాలా వున్నాయి. నిరంతర సాధనలోనే సంతృప్తి వున్నది, ఆనందం కూడా వున్నది. అదే అన్వేషణలో నా మనస్సు పరుగిడుతున్నది. అందువల్ల సుదీర్ఘమైన ఉత్తరాలు వ్రాయడానికి తీరుబడి లభించడం లేదు. అంతే కాని మీ అందర్నీ ఏమాత్రం మరచిపోలేదు. అది ఎన్నటికి జరుగదు. ఏమాత్రం భయపడనవసరంలేదు.

కొంతమందికి నా స్వభావం విచిత్రంగా కనబడుతుంది. జైలులో పడ్డందుకు విచారించాల్సింది పోయి ఇదీ ఒక మంచి సదవకాశమని భావించే నాలాంటివాడిని పిచ్చివాడేమోననుకుంటే అనుకోవచ్చు. కాని నేను ఆశావాదిని. ఆశావాది ప్రతి కష్టంలో ఒక అవకాశాన్ని చూస్తాడు. బాధలో సౌఖ్యాన్ని పొందుతాడు. చెడులో నుంచి గూడా మంచిని చూడగలుగుతాడు. తన దృష్టిని వెలుగుపైపుకే పోనిస్తాడు. చెట్టుకున్న ముండ్లను చూడడు, లెఖ్ఖచేయడు దానికి పూసిన అందమైన గులాబీల మీద మాత్రమే తన చూపు పోతుంది. నిరాశావాది దీనికి విరుద్ధంగా ప్రవర్తిస్తాడు. అతనికి ఆత్మవిశ్వాసం వుండదు. ధైర్యం అసలే వుండదు. నిరాశా నిస్పృహలు అతనిలో ఎల్లప్పుడూ తాండవిస్తుంటాయి. సంశయాలతో, అనుమానాలతో సతమతమవుతూ వుంటాడు. నిత్యమూ నరకాన్ని అనుభవిస్తూ వుంటాడు.

దూరదృష్టితో ఆలోచిస్తే కష్టమూ సుఖమూ ; బాధా సౌఖ్యమూ అనేవి వేరే ఎక్కడా లేవు. మన మనస్సులలోనే వున్నాయి. మన భావనలోనే వున్నాయి. దృఢసంకల్పులకు అంధకారంలోనే కాంతిరేఖ కనుపిస్తుంది. దుర్బలులకు పట్టపగలే చిమ్మచీకటిగా గోచరిస్తుంది. ఇది వారివారి మనస్తత్వం మీద ఆధారపడివుంటుంది అసలు మానవునిలో వుండవలసినది మనోధైర్యం, ఆత్మవిశ్వాసం.

ప్రపంచంలో ఏ ఆశయం, ఏ ఆదర్శం బాధలు, యాతనలు అనుభవించకుండా సాధించబడలేదు. బాధలను నవ్వుతూ నవ్వుతూ ఎదుర్కోవడం వలన ఎవరూ ఏమీ నష్టపోరు. పైపెచ్చు దృఢసంకల్పచిత్తులవుతారు. స్వామీ వివేకానంద ఒక ఉపన్యాసంలో కష్టాలను గురించి చెబుతూ " కొండను ఎలుక ఏమీ చేయలేదు. నన్ను కష్టాలు ఏమీ చేయలేవని నిశ్చలంగా భావించగలవాడే జీవితాన్ని ఎదుర్కొనగలడు " అని అంటాడు. ఈ సుదీర్ఘమైన జీవితయాత్రలో కష్టాలనేవి కొంతకాలం మాత్రమే మనతో వుంటాయి అంతమాత్రాన వాటిని చూచి భయపడి, నిరాశ చెంది జీవితంమీదనే విరక్తి కలగడం ఏమంత మంచిది కాదు. ఇది బలహీనుల లక్షణం. భగవంతుడు ప్రసాదించిన ఈ మానవ జీవితం విలువైనది గదా ! దీనిని సద్వినియోగపరచుకోవాలి. ప్రతి మనిషి తన్ను తాను ప్రశ్నించుకోవాలి ? నేను ఎవరికొరకు జీవిస్తున్నాను ? ఎందుకు జీవిస్తున్నాను ? నా గమ్యం ఏమిటి ? అని తనను తాను తర్కించుకోవాలి. ప్రతి వ్యక్తికి ఒక ఆశయం వుండాలి. ఒక ధ్యేయం వుండాలి. వాటిని సాధించడానికోసం తీవ్ర ప్రయత్నం చేయాలి. జీవితాన్ని ఒక క్రమ పద్ధతిలో నడిపించాలి ఇతరులపై ఆధారపడకుండా స్వశక్తిపైననే ఆధారపడి ముందుకు నడవాలి. అంతేకాదు ఇతరుల కష్టాల యెడల సానుభూతితో చేయూతనివ్వాలి. కొంగ తన ముక్కుతో తన కడుపును మాత్రమే నింపుకుంటుంది. మనిషి ఆ విధంగా ప్రవర్తించరాదు. తన వలన అనేకమంది బ్రతుకుతున్నారనే సంతృప్తి వుండాలి తన ఆశ్రయంలో అనేకమంది నిర్భాగ్యులకు వుండటానికి అవకాశం కల్పించగలిగాననే ఆనందం పొందాలి. అట్టివాని జీవితమే ధన్యం. అది అందర్కీ సులభంగా లభ్యం కాదు. అయినప్పటికి దానిని సాధించి తరించాలి. ఇక ఉంటా.

ఇట్లు
' నీ '

# న్యాయ నిర్ణయము

సదసద్వివేకమునే న్యాయమందురు. మంచి చెడ్డలలో మంచితనమును దేల్చఁగల ఆర్జవ దృష్టి న్యాయనిర్ణయము ; భారతదేశమున మిగిలిన కృత త్రేతా ద్వాపర యుగములయందీ న్యాయ పరిపాలనము క్రమ క్రమముగా సన్నగిల్లి, కలియుగమున నా మాత్రపుఁ జాయలు లేక వికృత స్వరూపమును దాల్చుచున్న న్యాయదేవతా దౌర్భాగ్య మేమనఁగలము ?

డా॥ చేబోలు చిన్మయబ్రహ్మారవి

రెండు పక్షముల వాఙ్మూలములను క్షుణ్ణముగా విని, యా వర్గముల రాగద్వేషములకు మూలకారణమగు దానిని గ్రహించి వానిలో నేయది న్యాయసమ్మతమైనదో నిర్ణయించుటలో లోకజ్ఞత—విశాల దృక్పథము—స్వార్థ రాహిత్యము–ధర్మప్రీతి మున్నగు సుగుణములున్నవారే యర్హులు ; తక్కిన హ్రస్వదృష్టిగలవారీ పొంతల నుండుటకైనను దగరు గదా !

విద్యాభివృద్ధి—విజ్ఞాన వికాసము—అంతలంతలై మహాభ్యుదయమును సాధించుచున్నామనుకొనుచున్న యీ కాలమున నన్ని దేశములయందును న్యాయనిర్ణయ మేరీతిగా జరుగుచున్నదో పరిశీలించినపుడు "న్యాయము"నకు అన్యాయమే జరుగుచున్నట్లు తోఁచును. డిగ్రీలు—హోదాలు–పదవులు–సంపదలు పెరుగుచున్నకొలఁది మానవులు మఱింత యార్జించి సుఖపడవలెనని అహోరాత్రులు విశ్రాంతి యెఱుఁగక స్వార్థవృక్షచ్ఛాయల లోనే కాపురము పెట్టుచున్నారు.

పదిమంది ఆశ్రయముగా నుండి ధర్మమును, న్యాయమును రక్షింపవలసిన న్యాయస్థానములు–ప్రభుత్వములు సైతమీ న్యాయనిర్ణయ సందర్భములోఁ దప్పటడుగులు వైచుచునేయున్నది. అన్యాయము న్యాయము కాదనియు, న్యాయము న్యాయమేయని నిర్ణయింపఁగల ఆత్మస్థైర్యము ముఖ్యముగా మేధావులయందు రవంత కానవచ్చుట లేదు. ఈ పదవి పోయిన గౌరవముగా బ్రదుకుట యెట్లు ? పుష్కలముగా వచ్చు నాదాయమును గాలఁదన్నుకొనుటయా ? మనదారిని గాదని యితరులకా లాభమును గలుగఁజేయుటయా ? యను ప్రశ్న పరంపరలలోఁ దారుమారై న్యాయదేవతను జక్కగా గౌరవింపఁగల న్యాయమూర్తులు, న్యాయవాదులు, న్యాయప్రియులు విషయమును పెడత్రోవఁ బట్టించుచుండుట చూడఁగా ముఖ్యముగా మన భారతమునఁ జరిత్ర ప్రసాదించిన యోగ్యత పవిత్రత యనునవి శూన్యములై పోవుచున్నట్లు భావింపవచ్చును. విషయమును కూలంకషముగాఁ జర్చించి యీ యీ కారణముల వలన వీరీ విషయమున సంపూర్ణముగా నర్హులని చెప్పఁగల చేవ—శేవి యువజనమున లోపించినది. న్యాయశాస్త్రములు–తత్సంబంధిత ప్రమాణ గ్రంథము లెన్నియున్నను వాని నన్నింటిని అధిగమించి న్యాయనిర్ణేతలు–స్వార్థపిశాచీదాసులై నిజమైన న్యాయమునకు విలువగట్టలేక పోవుచున్నారు. తాత్కాలికమగు ధనము, పదవులవలన నొరిగిపడునదేమి? పరమాత్మాంశకుఁ జెందిన మానవుఁడు న్యాయమూర్తిగా వ్యవహరింపఁ గల్గిననాఁడే మానవతా సంస్కృతి కొక యర్థమున్నది.

ఓనమాలు చెప్పు చిన్ని పాఠశాలలనుండి డాక్టరేట్లను ప్రసాదించు విశ్వవిద్యాలయముల వఱకు పరిశీలించి

చూచినపుడీ న్యాయదేవత-ఆ యా జాడలలో కుంటినడక సాగించుచునే యున్నది. అనేక గ్రంథములను రచించి, బహుభాషా నేతృత్వముగల్గి, స్వచ్ఛశీలముగల్గి విద్యాధికతలున్నవారున్నచోటనే యుండిపోవుచున్నారు. అనామకములగు నొకటి రెండు వ్రాసినవారు మహోన్నత గిర్యగ్రములలో గగనోపరితలమున విహరించుచుండుట చూచుచునేయున్నాము. ఈ దృష్టి దోషము వ్యక్తుల నుండి ప్రారంభమై పిమ్మట నా దోషము సమాజమునకు తదనంతరము దేశమంతట వ్యాపించుచుండుట యసత్యమందుమా ?

విద్యా విధానము-ఆధ్యాత్మిక మార్గము-కళాసాహితీ రంగములు-వేయునేటికి ? అన్నిరంగముల యందును దాంసిల్లుచున్న యీ యవినీతి-అన్యాయములను బట్టించుకొనక మేము చేయునదంతయు న్యాయబద్ధమే యని ప్రచారము చేసికొనుచున్న వ్యవహారములు కోకొల్లలున్నవి.

పరిశీలనానుభవము-బహు గ్రంథ పరిచయము-ఆత్మదర్శనము మున్నగు నెన్నియో సుగుణములుగల పండిత ప్రకాండుల సైతము న్యాయ నిర్ణయము చేయుటలో సాహసింపలేకపోవుచున్నారు. తన్మూలముగా నాత్మవంచకులగుచున్నారు. చిన్న పరిధినుండి పెద్ద పరిధి వరకుం గల యీ విశ్వవీథులయందు న్యాయదేవతారాధనమునకై సర్వము పరిత్యజించిన మహనీయులకు జన్మభూమియగు నీ భారతోర్వి యకళంక జీవితము పైపున కిప్పటికైనను మొగ్గునేమోనను చిన్న యాశ కానవచ్చుచున్నది. భావి పౌరులుగా లాలింపంగల చిన్నారి పాపలు వారిని పెంచుచున్న పెద్దలీ విషయమునం దగు శ్రద్ధ చూపవలసియున్నది. లేని పక్షమున అన్యాయాంధకార బంధుర లోకమునం గేవల స్వార్థ పిశాచములే స్వైర విహారము చేయక తప్పదు.

# వింతలు - విడ్డూరాలు

* సేకరించటంలో రకరకాల వస్తువులున్నాయి. కాని కాలిఫోర్నియాలోని స్టాక్‌టన్ అనే ఊరిలో ఫ్రాంక్ మెడినా అనే వ్యక్తికి ఒక వింతైన హాబీ ఉంది. అది గాలిమరలు సేకరించటం. 1850 నుండి 1920 వరకు అతను అమెరికాలో ఉపయోగించిన రకరకాల గాలిమరలను సేకరించాడు. వాటిని చిన్న మైదానంలో నిలబెట్టాడు. వాటి సంఖ్య ఇప్పటికి 103. ఆయన టార్గెట్ 500ంట. ఆయన వయస్సు 72 మాత్రమే.
* న్యూజిలాండ్‌లోని "గోవర్మ్" అను కీటకాలు సాలెగూడులా తమ ఇంటిని నిర్మించుకుంటాయి. ఇవి తమ గూడును తమ శరీరంనుండి వెలువడే వెలుతురులో ప్రకాశవంతం చేసుకుంటాయి. కరెంటు ఆదా కద మరి.
* క్రీ॥ శ॥ ( 1389-1464 ) మధ్యన చైనాలోని యుటేన్ అనే గ్రామవాసి అయిన హష్ యాహహోస్, వింత శరీరం కలిగిఉండెడివాడు పల్చని అద్దంనుంచి అవతలి వస్తువును తేలికగా కనిపెట్టగలిగేవాడు. అంతేకాదు అతని శరీరంలోపలి అవయవాల్ని మామూలు కంటితోనే చూడవచ్చు. అంటే అతని శరీరం అందం అలాంటిదన్నమాట.
* పశ్చిమ జర్మనీలోని ముగ్గురు యువకులు ఒక రోజున ఎక్కడలేని ఉత్సాహం పుట్టుకొచ్చి 60 సెంటీమీటర్ల పొడవు, 60 సెంటీమీటర్ల వెడల్పు ఉన్న చిన్న ప్లాట్‌ఫారంమీద 128 గం. పాటు కొన్ని గంటలు కూర్చొని, కొన్ని గంటలు నిద్రపోయి రికార్డు నెలకొల్పారు.
* బ్రెజిల్ దేశంలో 45 సం॥రాల వయస్సుగల స్త్రీ 32 మంది బిడ్డలను ప్రసవించింది. ఆమెకు 14వ ఏట వివాహం కాగా తన 31 సం॥రాల వైవాహిక జీవితంలో ఆమె ఇంత సంతానాన్ని కన్నది.

# గీ అమృతవర్షిణి

శ్లో॥ ప్రకృతేః క్రియ మాణాని గుణైః
కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా
కర్తా హమితి మన్యతే ॥

— 'కర్మ' అనగా చలనము అని అర్థము. దేహ, ప్రాణ, మన, ఇంద్రియాదులన్నియును చలనశీలములే. కావున ఇవన్నియూ కర్మ స్వరూపములే ప్రతి కర్మకూ సంకల్పము ఆధారము. సంకల్పమునకు గుణము ఆధారము.

## సాయి గంగా మహా దేవ్

గుణమునకు ప్రకృతి కారణము. కావున ఏతావాతా కర్మకు ప్రకృతే మూలహేతువని తేలుచున్నది. అసలు ప్రకృతి అనగా ఏమిటి? కంటికి కనపడు జగత్తే ప్రకృతి అనుట సరియైనది కాదు. ఆకృతికి ( జన్మకు ) ఆధారమైనది ప్రకృతి. జన్మకు హేతువు అవిద్య. అవిద్య అనగా ఆత్మ విస్మృతి, స్వరూపానుభవచ్యుతి. కనుక ఆత్మ జ్ఞాన శూన్యత్వమే ప్రకృతి. కనుక కర్మకు కారణము ఆత్మ జ్ఞానశూన్యత్వమే, కానీ ఆత్మ కాదు.

అవిద్య వలన గుణప్రోద్బలములై సంకల్పములు ఇంద్రియాదుల ద్వారా కర్మాచరణ ప్రయుక్తములవు చున్నవి. ఈ విషయమును గ్రహించలేని మూర్ఖుడు తానే వీటినన్నింటిని చేయుచున్నట్లు భ్రాంతి చెందుచున్నాడు. చీకటి గదిలోని వాడు ఆ గదిలోని అల్ప ప్రాణులు చేయు సందడిని తానే చేయుచున్నట్లు భావించి భ్రాంతి చెందు నట్లు, అవిద్య అను చీకటిలో నున్నవాడు గుణముల ద్వారా జరుగు కర్మ కలాపములను తానే నొనరించునట్లు అహంకారము చేత భ్రాంతి చెందుచున్నాడు.

అహంకారము అదృశ్యమైన అజ్ఞానము కూడా అదృశ్యం కాగలదు అహంకార మనగా ఏమిటి? అహంతత్త్వమునకు ఆకారములను ఆరోపించుటే అహంకారము. అహం అనగా బ్రహ్మము లేదా ఆత్మ. అది తానే. నిరాకారమైన తనను సాకారముగా అనగా దేహముగా తలంచుటే అహంకారము. అంతేగాని అహంకార మనగా అందరూ భావించునట్లు గర్వము కాదు. దేహ ధ్యాసకే అహంకారమని పేరు. దేహ ధ్యాస గలవాడే తాను కర్తనని భావిస్తుంటాడు. దేహ ధ్యాస మీఁడి దేహి ధ్యాసలోనికి వెళ్ళిన తాను కర్తను కానని భర్తనని గ్రహించగలడు. కర్తృత్వ భావన వల్లనే కాయములు సిద్ధించుచున్నవి. కర్తృత్వ భావనలుడిగితే కాయముల ప్రాప్తి అనగా జన్మలు కూడా ఉడిగినట్లే. కర్తృత్వాభిమానము వలన భోక్తృత్వాభిలాష కలుగుతున్నది. కర్తృత్వ, భోక్తృత్వముల మధ్యలో అవిద్యా పీడితుడు అణగద్రొక్కబడుతున్నాడు. ఈ బంధములు కర్మల వలన నివృత్తికావు. కర్మల విషయంగా కలిగిన ఈ బంధములు తిరిగి కర్మల ద్వారా నివృత్తి కావు. ఆశ్రయించ వలసినది కర్మను కాదు, మర్మమును. పదండి ముందుకు కాదు, పదండి వెనక్కు. ముందుకు వెళ్ళుట అజ్ఞానము. వెనక్కు వెళ్ళుట సుజ్ఞానము, విజ్ఞానము. ముందున్నది సృష్టి, వెనకన వున్నది సృష్టి కర్త. ఆ కర్తను చేరినప్పుడే ఈ కర్తృత్వ భావన నశిస్తుంది. కనుకనే మహాత్ములు "ఎచ్చట పుట్టె నచ్చటికి యేగుట నైజము ప్రాణికోటికిన్" అని "త్రోవ వెదకుకొనుట దొడ్డ బుద్ధి" అని ప్రబోధించారు. అనగా "నేనాత్మనని గ్రహించుడు" అని భావన, ఆత్మప్రాప్తితో అహంకారం పోయి, ఆనందం ప్రాప్తించునని నాటి ఋషుల సాటిలేని మేటి బోధ.